



# ఎల్లప్పుడు చురుకుగా ఎల్లప్పుడు చైతన్యంగా

మీ బిడ్డ పెరుగుతున్నప్పుడు, ఆ బిడ్డ నిరంతరం అదనంగా శక్తి వినియోగించడం జరుగుతుంది.

బూస్ట్‌ను పాలల్లో కలిపితే, రుచికరమైన మాల్ట్ చాకొలెట్ పానీయం తయారౌతుంది. అది మీ బిడ్డకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన, మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో తయారైనది.

మీ బిడ్డకు, శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది మీ బిడ్డ రోజంతా, ప్రతి రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.




## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

# బూస్ట్

మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు




ఈ ఎకానమీ రీఫిల్ ప్యాక్ ద్వారా రు. 1/- ఆదా చేయండి

HTD-HMM-6177

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 28-8-'81

దుర్మతి నామ సం. శ్రావణ బ. చతుర్దశి

సంపుటము 74 : సంచిక 50

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడి ప్రతి వెల రు. 1-25 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# ఉత్తరాలు

## ముఖచిత్రం

జయప్రద ముఖచిత్రం పత్రికపై చూడ
డే తెలుగింటి ఆడపడుచు జ్ఞాపకం వచ్చింది.

వై. బాలరాజు [జనగాం]

* * *

31.7.81 తేది సంచిక జయప్రద ముఖ
చిత్రం చాల ఆకర్షణీయముగా ఉంది.

బి. లక్ష్మణశాస్త్రి [భీమవరం]

* * *

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర
సచిత్ర వారపత్రిక అత్యంతాకర్షణీయంగా ఉంది. పట్టు చీరెలో, బంగారు నగలతో, తలలో పువ్వులు తురుముకుని, నుదుట కుంకుమ దిద్దుకుని తెలుగు వారి పిల్లలా దర్శనమిచ్చిన జయప్రద ముఖ చిత్రాన్ని అలా చూస్తూనే ఉండిపోయాను. తెలుగువారి ఆచార వ్యవహారాలను సూచించే వ్యాసాలు, కథలు, ముఖచిత్రాలు ప్రచురించి పాఠకుల ప్రశంస లందుకొనటంలో ఆంధ్రపత్రిక వీక్లీదే అగ్ర స్థానం.

పి. వి. రామనాథరావు [మధిర]

## సినిమా

శోభన్‌బాబు, రతి జంట ముఖచిత్రం గల 7.8 81 ఆంధ్రసచిత్ర వారపత్రికలో హిందీ చిత్రరంగంలో దాసరి నారాయణరావు—శ్రీ వీరాజీ గారి వ్యాసం పాటోతో సహా సమ్మోకర్షించింది.

ఎల్. పి. చంద్ర, చిట్యాల రవీంద్రరావు, లక్ష్మ
రాజు ప్రఫుల్ల [ధర్మవరం]

* * *

7 8.81 పత్రిక రతి, శోభన్‌బాబు ముఖ చిత్రముతో చాల ఆకర్షణీయంగా ఉంది. ముఖ్య ముగా సినిమా విశేషాలు ఆకర్షణీయంగా ఉంటు న్నాయి.

కె. శారద [భోగాపురం]

(65 వ పేజీ చూడండి)



లోకంపోకడ * టీమెన్



సీరియల్

# నర్సింగ్‌హోం

శ్రీరంగం

(గత సంచిక తరువాయి)

అతను లోపలికివచ్చి 'చూడండి! మీరు యింత మంది పేషంట్స్‌ని చుట్టుముట్టడం బాగోలేదు. ఆపరేషను చిన్నదిగా అయిన పేషంటు మంచంమీదే మీరు బయట నుండి వచ్చిన బట్టలతో కూర్చుంటున్నారు. పేషంటుకి మీ బట్టలనించీ, మీరు విడిచే గాలులనించీ యిన్‌ఫెక్షన్ చుట్టుకుంటుంది. మీరు ఎంత తక్కువగా వచ్చి, ఎంతదూరంగా నిలబడితే అంత మంచిది. ఇంకో సంగతి ఇంత మంది యిక్కడ అనవసరం. ఒక్కరు అటెండెంటుంటే చాలు. మిగతా వాళ్ళు విజిటింగ్ అవర్సులో రండి' అన్నాడు.

మొదటిసారిగా యిలాంటి మాటలు వింటూంటే వాళ్ళు తెల్లబోతూ 'సరే' అన్నట్టు తల ఊపేరు.

అతను అక్కడనుండి కదులుతూ మిగతా గదుల్లో చూసేడు

కొన్ని కొన్ని గదుల్లో చిరుతిళ్ళు తిన్న కాయితాలూ, మరికొన్ని గదుల్లో పళ్ళతొక్కలూ, మరికొన్ని గదుల్లో చాక్లెట్ల కవరులూ, సిగరెట్ పీకలూ – అన్నీ క్రిందే ఉన్నాయి.

వార్డుబాయిని పిలిచి 'యివన్నీ ఏంటి ?' అంటూ అడిగేడు.

'నాకు తెలియదుసార్'

'అయితే జీతం నీవు వొట్టినే తీసుకుంటున్నావన్నమాట. డ్రస్సు బాగాచేసి తలకు క్రీములు పట్టించి ముస్తాబు చేసుకుని సినిమాకా, పనికా వొచ్చింది ?' అని 'రేపటి నించీ కాకీ డ్రస్సు మీదే రావాలి. యిలా యిష్టం వొచ్చినట్టు డ్రస్సు చేసుకుంటే బయటికి గెంటేస్తాను' అని బెదిరించి కదిలి పోయేడు

అతను అన్ని రూములూ చూసి తిరిగి వొస్తూంటే – ఒక రూం కనిపించింది. తలుపు కొద్దిగా తెరచి ఉంటే, తలుపుతట్టి లోనికివెళ్ళేడు. తన్ని చూస్తూనే 'ఏం కావాలి ?' అన్నట్టు ముఖం మాడ్చుకుంది.

అప్పుడు ఆమె సన్నటి ఉలి పొరలాంటి బట్టతో చేతులో పుస్తకంతో మంచం మీద పడుకుని కనబడింది. ఆమె చదువుతున్న పుస్తకం అట్టమీద వివస్త్ర అయిన స్త్రీ ఫొటో ఉంది పేరు చూసేడు, అదో సెక్సు పుస్తకం.

తను లోనికి రాగానే ఆమె లేచి పమిటను సవరించుకుని పుస్తకాన్ని తలక్రింద దాచేందుకు ప్రయత్నిస్తూ 'ఏంటండి ?' అంది కొద్దిగా కోపంతో

'ఏంలేదు నర్సింగ్‌హోం ఎలా జరుగుతుందో చూస్తున్నాను' అని వెనక్కు తిరిగేడు. అతను బయటికి రాగానే తలుపు మూసిన శబ్దం. తర్వాత గడియ పెట్టిన శబ్దం వినిపించేయి.

యీమెను చూస్తూంటే తనకు అంత సద్భావం కలగటంలేదు.

తను బయటికి వచ్చేటప్పటికి ఒకతను టేబుల్‌మీద కూర్చొని కాళ్ళు కుర్చీ మీద పెట్టి, కేరింతలు కొడుతూ, విరగబడి నవ్వుతూ మాట్లాడుతున్నాడు, ఫోనులో. అతని తలవెంట్రుకలు నుదుటిమీద రింగులుగా పడుతున్నాయి. అతని చొక్కాపై రెండు గుండీలు పెట్టుకోవడం మరచిపోయినట్టున్నాడు. అతని ఛాతీ బలంగా నల్లగా కనిపిస్తూంది.

రాజా దగ్గరికొస్తూ "ఏయ్ మిస్టర్' అన్నాడు.

అతను తలతిప్పి అతన్ని చూస్తూనే టేబిలుమీద నించి దిగుతూ 'సార్' అన్నాడు స్పీకరు మీద చేయి ఉంచుతూ.

"ఎవరునువ్వు ?' అంటూ అడిగేడు రాజా.

'నేను వార్డుబాయ్ సీనుని సార్' అన్నాడు తొట్రుపాటుతో.

'వూ' అని 'ఎవరితో మాట్లాడుతున్నావ్ ?' అన్నాడు సీరియస్‌గా.

'రూంనెంబరు అయిదుకు ఫోను వచ్చింది సార్ పేషంటును పిలవమని'

'పేషంటుని పిలవమంటే పిలవకుండా

**జరిగినకథ –:** 6 శంకర్ రాజా ఎం.డి. లో గోల్డ్ మెడల్ సంపాయించుకొంటాడు. ఇప్పుడు అతను తన కుటుంబాన్ని మోయవలసి వున్నది. రాజా, మంజుల ఇరువురూ ఒకరి నొకరు పరస్పరం ప్రేమించుకొంటారు. అతను ప్రాక్టీసు పెట్టి, కొంత ఆర్థికస్తోమత చిక్కిన తరువాత పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకొంటారు. డా. విశ్వం సహాయంతో ప్రాక్టీస్ పెడతాడు రాజా. ఎం. బి బి. యస్. పూర్తి కాకుండానే కొంతడబ్బు ఖర్చుపెట్టి ఆర్. ఎం. పి. డిగ్రీ తీసుకొని డిస్పెన్సరీ తెరుస్తాడు డా. రాధాకృష్ణ. అతను తన భార్య సుగుణకు కూడా ఓ ఆర్. ఎం. పి డిగ్రీ సంపాయించి ఆమెను తన డిస్పెన్సరీలోనే లేడీ డాక్టర్‌గా వేసుకొంటాడు. డాక్టర్ విశ్వం దగ్గరకు ఓ అమ్మాయి వచ్చి, మీరు లోగడ నా భర్తకు చేసిన 'వేసక్టమీ' ఆపరేషన్ ఫెయిల్ అయిందని అతనితో చెప్పమని, ఫీజు క్రింద తన గాజులు తీసి యిస్తుండగా, విశ్వానికి అహం అడ్డురాగా బయటకు పొమ్మంటాడు. ఆమె పోతుండగా బస్తా పేరు అడిగి తెలుసుకొని ఆమెకు సహాయం చేస్తాడు. డా. రాధాకృష్ణ ఎక్స్‌కౌన్సిలర్ సహాయంతో ఓ మందులషాపు పెట్టి, అందులో చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్న తన తమ్ముళ్ళకు దొంగ సర్టిఫికేట్‌లు సంపాయించి వాళ్ళను అందులో వుంచుతాడు. డా విశ్వం నర్సింగ్‌హోం మేనేజర్ జబ్బుచేసి వెళ్ళిపోతే, అతను వచ్చేవరకు ఆ సీటు డాక్టర్ రాజాకు అప్పగించుతాడు. విశ్వం అస్తవ్యస్తంగా వున్న ఆ నర్సింగ్‌హోంను చూసి, దానిని ఓ దారికి తేవాలని ప్రయత్నిస్తుంటాడు రాజా

ఖుషీగా కబుర్లు చెబుతున్నావే ఏంటి?' అని అతని చేతినుండి ఫోను తీసుకుని 'హలో' అన్నాడు.

అవతలనించి మధురంగా 'ఏం సీనూ? ఈసారి గొంతుక మార్చి తమాషా చేస్తున్నావేంటి? నువ్వు ఏం చేస్తున్నా నేను గుర్తుపట్టలేననుకుంటావేంటి? రాత్రి భలే చిలిపిగా చేసావోయ్. నా బుగ్గలు యింకా ఎలా మండిపోతున్నాయో తెలుసా?'

'అమ్మా! నేను డాక్టరు రాజాను నర్సింగ్ హోం యిన్‌చార్జిని. నువ్వు డ్యూటీమీద ఉన్నవాళ్ళకు యిలా ఫోన్లు చేయకూడదు' అని ఫోను పెట్టేసి సీనువైపు తిరిగి 'ఆ బటన్ను పెట్టుకో' అని అరచినంత పనిచేసి 'నువ్వు పని చేయడానికి వచ్చావా లేకపోతే ఫోనులో నీ గర్ల్ ఫ్రెండ్స్‌తో సరసాలు ఆడడానికి వచ్చేవా? ఇలాంటి పిచ్చిపిచ్చి వేషాలు వేస్తే వీపు చీరుతుంది. రేపటినించి కాకీ బట్టలు వేసుకుని తల దువ్వుకొనిరా' అని చీదరింపుతో 'నర్సింగ్‌హోంలో విజిటర్స్ అందర్నీ బయటికి పంపించేయ్. సాయంత్రం విజిటింగ్ అవర్స్‌లో రమ్మను. ఆపరేషను అయినవాళ దగ్గర మాత్రం ఒక్క అటెండెంటు ఉండనీ వీళ్ళు బయటికి వెళ్ళగానే గేటు మూసేసి తాళం వేసి, ఆ తాళం చెవి నాకిచ్చేయ్ తాళం తెరిచేటప్పుడు నన్ను అడుగు ఆ ఫోనుకీ తాళంవేసి దాని చెవికూడా నాకిచ్చేయ్.'

'పేషంట్ల గదులనిండా చెత్త ఉంది దాన్ని శుభ్రంచేసి వాళ్ళు పారేసేవన్నీ డస్ట్‌బిన్‌లో వెయ్యాలని చెప్పు. అందులో ఏంతేడా వొచ్చినా నీపీక తీసేస్తాను జాగ్రత్త' అన్నాడు రాజా.

సీనుకు రాజా ధోరణి చూస్తే కోపం వచ్చింది. 'సార్. మేం ఎంత వార్డుబాయిలం అయితేమటుకు మీరు అలా పీక తీసేస్తాను అంటే బాగుండదు' అంటూ అవమానంతో అన్నాడు.

పిచ్చి తోవకు తీసుకురావాలనే అలా రెచ్చగొట్టాడు. వీడికిగాని బుద్ధి చెప్పకపోతే స్టాఫ్‌లో భయం, భక్తి, శిక్షణ ఏం వుండవు. అందుకే 'బాగుండదు అంటే ఏం చేస్తావు?' అంటూ దగ్గరికి వచ్చి ముఖాన్ని అతని దగ్గరగా ఉంచి అన్నాడు.

'ఏంచేస్తానా' అంటూ ఏం చేయాలి? అని ఆలోచిస్తున్న సీనుని రాజా తన రెండు చేతులతో ఎత్తి 'మాటలు తిన్నగా రాకపోతే మేకుకి వేలాడదీసాను చొక్కాలా' అన్నాడు అలానే గాలిలో ఉంచుతూ.

కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ 'సార్' అన్నాడు ఊపిరి సరిగా ఆడకపోతూంటే. రాజా అతన్ని క్రిందకు దింపి 'నా గదిలో కూర్చొని వుంటాను, నేను చెప్పిన పని కాగానే నాకు వచ్చి చెప్పు' అంటూ వెళ్ళిపోయేడు.

రాజా కన్సల్టింగ్ రూంకి నర్సింగ్ హోంలోకి ఒక ద్వారం ఉంది అలానే విశ్రాం గదిలోకి ఉంది.

తను కూర్చున్న పది నిముషాలకు తాళం చెవి వొచ్చింది.

ఆరోజు విశ్వం అయిదు కేసులు రిఫర్ చేసేడు పదకొండు గంటలకి రోజూ మాదిరిగానే విశ్వం గదికి వెళ్ళేడు రాజా. రాజా తను తీసుకున్న చర్యలు చెప్పి 'ఆ ఒకటో రూం నెంబరు పేషంటు ఎవరుసార్?' అన్నాడు.

'ఆమె ఒక విచిత్రమైన వ్యక్తోయ్!



# నర్సింగ్ హోం

ప్రతీ ఆరునెలలకు వొస్తుంది. వొక నెల ఉంటుంది, వెళ్ళిపోతుంది.'

'ఆమెకు బాధ ఏంటిసార్ ?'

'అపెండిక్సు స్థలంలో నొప్పి అంటుంది. ఆపరేషన్ చేస్తానంటే మందులే యివ్వమంటుంది. వొకరోజు కొంచెం నొప్పి అంటుంది. మరోరోజు అసలు నొప్పేలేదంటుంది. 'మరి వొప్పి తగ్గిపోయిందిగా డిస్చార్జి చేస్తాను' అంటే యింకో పదిరోజులు అబ్జర్వేషన్‌లో ఉంచమంటుంది.'

'ఆమె యిల్లు ఎక్కడ సార్'

'ఇక్కడికి యాభై మైళ్ళ దూరంలో ఒక పల్లెటూరుంది. ఆమె భర్త పెద్ద వ్యవసాయదారుడు. చాలా డబ్బున్నవాడు. భార్య అంటే ప్రాణం.'

'అతను చూసేందుకురాడా సార్ ?'

'అతనికి వ్యవసాయపనుల్లో తీరికేఉండదు. యీ మధ్య వొచ్చి ఉంటుంది. అతను పదిరోజులకోసారి వచ్చి పోతూంటాడు.'

ఇంతలో ఫోను మోగింది. విశ్వం ఫోను ఎత్తి డా. విశ్వం స్పీకింగ్ అన్నాడు.

'గుడ్‌మార్నింగ్‌సార్. నేను డా. శేఖర్నిసార్'

'ఏం శేఖర్ ఎలా ఉన్నావ్ ? కులాసానా?'

'దాన్ని గురించే మీతో మాట్లాడాలి సార్ ఎప్పుడు రమ్మంటారు'

'నీ యిష్టం'

'ఇప్పుడు రమ్మంటారా'

'ఎంతసేపట్లో వస్తావేంటి ?'

'పదినిముషాల్లో సార్'

'అయితే కారు పంపిస్తాను' అంటూ ఫోను పెట్టేసేడు విశ్వం.

డాక్టర్ రమేష్ రోజు రోజుకీ వృద్ధిలోకి రాసాగేడు. అతను మంచివాడు, నెమ్మదస్తుడు. చూడగానే జబ్బును గుర్తించి దానికి తగిన మందు యివ్వగలడు అన్న పేరు తెచ్చుకుంటున్నాడు. అతని దగ్గరకు వచ్చిన ప్రతీవాడూ వొకప్పుడు రాధాకృష్ణ పేషంటె.

రాధాకృష్ణ ఖచ్చితమైన మనిషి. అతను మనుష్యుల ముఖాల్ని బాగా గుర్తుపెట్టుకుంటాడు. వొక్కసారి ఆయన దగ్గరకెళితే రెండోసారి పేరు పెట్టి పిలిచి మరీ పలుకరిస్తాడు. కాని డబ్బు దగ్గర మాత్రం వొక్క పైసా కూడా పోనీడు. ఎవరేనా పావలా తక్కువ యిచ్చి రేపు యిస్తాం అని ఆరు నెలల తర్వాత వొచ్చినాసరే అతను గుర్తుపెట్టుకుని జ్ఞాపకం చేసి తీసుకుంటాడు. అతన్ని పేషంటు ముంచడం అన్న ప్రసక్తే లేదు. అతను ఎంత తెలిసినా పదిరూపాయల అప్పుకంటె ఎక్కువ యీయడు ఆ డబ్బు చెల్లిస్తే యింకో క్రొత్త అప్పు పుడుతుంది.

రాధాకృష్ణ ఉద్దేశంలో పేషంటుకు అమితంగా అరువిస్తే ఆ అరువు చెల్లించలేక డాక్టర్ని మార్చేస్తాడు. దాంతో పేషంటూ పోతాడు, డబ్బూ పోతుంది. దీని బదులు పది రూపాయల కంటే అరువు ఎక్కువ యీయకుండా, మంచి మాటల్తో ఆ పదీ తీసుకుని తిరిగి యింకోపది యిస్తూ, యిలా జరిపిస్తే పేషంటు పది రూపాయలేకదా!! అని డాక్టర్ని మార్చే ప్రసక్తే ఉండదు.

రమేష్ దీనికి భిన్నంగా ఉంటాడు. అతడు పేషంట్లు డబ్బు యివ్వలేకపోతే 'రేపు యివ్వండి! మీ దగ్గర ఉన్నప్పుడు యివ్వండి' అంటాడు. వొక్కొసారి అతను ఎదురు యివ్వడం కూడా జరుగుతుంది. మరీ డబ్బు లేనివాడూ, చాలా కష్టాల్లో ఉన్నవాడూ జబ్బుతో డబ్బు లేకుండా వస్తే అతను మందిచ్చి 'యిందయ్యా రూపాయి ఉంచు, దీంతో బ్రెడ్డూ, పాలూ కొనుక్కో' అనేవాడు.

అతని యీ స్వభావాన్ని కొందరు ఉపయోగించుకోవడం మొదలు పెట్టేరు మరీలేనివాడు అసలు యివ్వలేడు. ఏ కొద్దోగొప్పో ఉన్నవాడు మూడు రూపాయలకి 'రెండు మొదటి రోజు యిచ్చి, రెండో రోజు రూపాయి యిచ్చి, మూడో రోజు, మర్నాడు యిస్తాం' అని ఎగనేసేందుకు ప్రయత్నిస్తూ 'మీరు దేవుళ్ళు సార్! డబ్బు అసలు అడగనే అడగరు ఆ రాధాకృష్ణగారు ఉన్నారు చూడండీ డబ్బు గుమ్మంలోంచే లోనికి విసిరి అడుగుపెట్టండి' అని అనేరకం సార్. డాక్టరు అన్న తరువాత మరీ అంత కసాయివాడుగా ఉంటే ఎలాసార్! 'రోగంఎప్పుడూ ఫస్టుతారీకే రాదుకద సార్! నెలాఖరుకి వచ్చినా వీడికి వొక ఫస్టు అంటూ ఉంది అని కనిపెట్టుకు ఉండడం ఆ రాధాకృష్ణకు లేదుసార్ అని అప్పుపెట్టేవాళ్ళు.

రమేష్‌కి వచ్చిన పేషంట్సులో నలభై వంతులు క్రెడిట్ కేసులే. అసలు ప్రయివేట్ ప్రాక్టీసు అప్పు యివ్వకపోతే నడవదు. ఆ అప్పుకూడా పదిశాతం కంటే ఎక్కువ ఉండకూడదు. ఆ పది శాతంలో ఎనభై వంతులే వసూలు అవుతాయి. ఆ యిరవై వొంతులూ అసలు రావు వాటిని బ్యాడ్ డెట్స్ అంటారు. అవి ప్రతీ డాక్టరుకీ ఉంటాయి. వాటిని వొక రెండు నెల్లు చూసి డాక్టర్లు ఆ కాయితాలు చింపేస్తూంటారు అంతేకాని రమేష్‌లా నలభై వంతులు అప్పులు ఎవ్వరూ యివ్వరు.

పేషంటు సాధారణంగా దేనికైనా డబ్బు ఖర్చుపెట్టుకుంటాడు గాని, డాక్టరు ఫీజు యివ్వాలంటె ఏడుస్తాడు. దాన్ని ఎగవేసేందుకు ఎన్ని ప్రయత్నాలున్నాయో అన్ని ప్రయత్నాలూ చేస్తాడు డాక్టరు ప్రతిభ



మంచి మాటలు చెప్పి డబ్బు రాబట్టుకోవడంలో ఉంటుంది. అదేగాని డాక్టరు లోపిస్తే —అతనికి కరెంటు ఖర్చుకు కూడా కలెక్షను సరిపోదు.

రోజుకి ముప్ఫై పేషంట్లదాకా వొస్తూ, అందులో పదహారో పదిహేడో డబ్బుయిస్తూ మిగిలినవాళ్ళు ఎగవేసేందుకు ప్రయత్నిస్తూంటే, రమేష్ తన్ను పేషంటు ఫూల్ చేస్తున్నాడు అనుకోలేదు. పాపం వాడి దరిద్రం అలా ఉంది అనుకున్నాడు. అదే అతన్ని ముందరకు పడనీయడంలేదు. పేషంట్ను అధికం అవుతూన్నా కలెక్షను మాత్రం అధికం కావటంలేదు.

దీనికితోడు అతను పేషంటుతో 'మీరు యిన్ని నెలలనించీ బాకీ ఉన్నారు మీ బిల్ యింతయింది, దీనిలో కొంత అయినా చెల్లించాలి. లేకపోతే మాకు ఎలా నడుస్తుంది చెప్పండీ' అని నోరు విడిచి అనలేడు.

ఎక్స్‌కౌన్సిలర్ రాధాకృష్ణతో వొకరోజు గొడవ పెట్టేసేడు 'మీ స్నేహితుడు...అదే ఆ రమేష్ యిప్పుడు కొత్త టాక్‌టిక్సు మొదలుపెట్టేడు. అందరికీ అప్పు అడగకుండా మందుయిచ్చి అలా తిప్పేసుకుంటున్నాడు మన పేషంట్సను. అతనికి తెలియదు పాపం వీళ్ళు డబ్బు అడగనంత సేపూ మందుకు వస్తారనీ అడుగుతే తుర్రుమంటారనీ! కాని యిలా చేస్తే, అటు తనూ తినలేడు ఇటు మనల్నీ తిననీయడు. యీ వెధవ ఎత్తులు వేస్తూ చాపకింద నీళ్ళలా పాకుతున్నారు డాక్టర్. మనం పూర్తిగా మేలుకొనేటప్పటికి మనం కూడా అతని వశం అయి ఉంటాం. నా మాట విని...'

అప్పుడు రాధాకృష్ణ అంతగా ఎక్స్‌కౌన్సిలర్ మాట వినడంలేదు. తన ఆలోచనలలో తను ఉన్నాడు. తను కొత్తగా తయారు చేసే మందులు రేపటినించీ మార్కెట్‌లోకి వస్తున్నాయి. అందులో యిప్పటికే పదివేలు పెట్టేడు. దీని రిటర్న్స్ ఎలా ఉంటాయో? అని ఆలోచిస్తున్నాడు. తన యిద్దరు తమ్ముళ్ళలో వొకడికి కొంచెం రిప్రజెంటేటివ్‌లా ట్రైనింగ్ యిచ్చేడు. అతడ్ని — క్రొత్తగా డిస్పెన్సరీ పెట్టినవాళ్ళనూ, ఆర్. ఎంపీలనూ మాత్రమే కలిసి ప్రతీ అయిదు సీసాలు రాసినందుకూ వాళ్ళకు వొక సీసా ఫ్రీగా దొరుకుతుందనీ, యింకా వాళ్ళు వొప్పుకోకపోతే రెండు సీసాలు అని చెప్పమని చెప్పేడు. యింటివాళ్లకు టానిక్కు యివ్వొచ్చు అని ఆశపడే ఆర్.ఎంపీలు వొక డజను దాకా ఉన్నారు. వొక్కొక్కళ్ళూ రోజుకి వొక్కో సీసా రాసినా, నెలకు కనీసం మూడువందలు సీసాలు ఖర్చయినా, తనకు మూడువేలు చేతికి వస్తుంది. అందులో ఖర్చుకి వెయ్యి తీసేస్తే రెండువేలు లాభం.

తను యివాళ పన్నెండు ఆర్. ఎంపీలకూ డిన్నర్ డ్రింక్సు ఎరేంజ్ చేసేడు వొక మూడొందలఖర్చు. ఆ పార్టీలో తను వాళ్ళతో తన స్నేహితుడొకడు ఉన్నాడనీ, అతనికి సహాయం చేయమనీ, అడుగుతాడు. మర్నాడు తన తమ్ముణ్ణి పంపిస్తాడు. ఇది నెలరోజులు సాగనిచ్చి, తను వేరే మందుల మీద కూడా

వచ్చాడు ఒక సంవత్సరంన్నరలో చేసుకో గలిగినంత డబ్బు వేసుకుని వైండ్ ఆఫ్ చేసేయాలి.

రాధాకృష్ణకు అయిదు సంవత్సరాలలో వొకరెండు మేడలూ, వొక పది ఎకరాల ద్రాక్షతోటా, వొక కారూ, వొక లక్ష ఫిక్స్‌డ్ డిపాజిట్ యివన్నీ స్వంతం కావాలి అని ఉంది. అందుకే అతను రిస్కు తీసుకుంటున్నాడు.

'డాక్టర్ ఏంటి పరధ్యాన్నంగా ఉన్నారు నేను చెప్పింది వింటున్నారా?' అంటూ ప్రశ్నించేడు ఎక్సైజ్‌కాన్సిలర్ ?

'ఏంఫర్వాలేదు టైము రానీండి, తగిన చర్య తీసుకుందాం' అన్నాడు.

'సీ యిష్టం డాక్టర్' అని 'ఏంటి నిన్న యింటికి రాలేదు ? యీరోజు నించి నా భార్యకు వాంతులు మళ్ళా మొదలయేయి'

'వస్తానండి' అంటూ అతనికి సిగిరెట్, టీ యిచ్చి పంపించేడు.

ఆరోజు పార్టీ చాలా బ్రహ్మాండంగా జరిగింది. వచ్చినవాళ్ళందరూ పొంగిపోయేరు, తమని వొక ఎంబీబియస్ డాక్టరు పిలిచి పార్టీ యిస్తున్నందుకు! పార్టీ మధ్యలో సికిందరా బాదులోని ఆర్. ఎంపీ పితామహుడు విలేజ్ ఆర్. ఎంపీల చేత బ్రహ్మరథం పట్టించుకున్నవాడూ, చిన్న ఉపన్యాసం లాంటిది యిచ్చి 'డాక్టర్ రాధాకృష్ణ చిన్న వాడయినా చాలా తొందరలో ముందుకు వచ్చేడనీ తను యిన్నాళ్ళనించీ ఈ ఊళ్ళో ఉంటున్నా తనకు యిలా అందరితో కలసి వొక గ్రూప్‌లా ఉండాలన్న ఆలోచనరాలేదనీ, రాధాకృష్ణ తమందర్నీ దగ్గరికి తెచ్చినందుకు అతన్ని అభినందిస్తున్నాననీ అనీ ప్రతీ వెలా వొక్కొక్కళ్ళు వంతులవారీగా పార్టీ యివ్వాలనీ, దీనితర్వాత పార్టీ వచ్చేనెల యిదేరోజు తమ యింట్లోనే అనీ' కూర్చున్నాడు. తర్వాత వొకోళ్ళు ఒక్కొక్క వెల వంచుకున్నారు. పార్టీ అయింతరువాత, అందరూ వెళ్ళేముందు రాధాకృష్ణ తన మనస్సులో ఉన్నవిసూచిస్తూ 'మనం మంచి భవిష్యత్తు ఉన్న యీ కుర్రాడికి చేయూతనివ్వాలి. మీరేం అంటారు' అన్నాడు.

'తప్పకుండా' అంటూ అందరూ వెళ్ళి పోయేరు.

* * *

డా. రమేష్ ఏ మందు పేషంటులను కొనుక్కోమన్నా వాళ్ళు రాధాకృష్ణ మెడికల్

## లేసర్ మైక్రాస్కోపు

సూర్యకాంతిని లేక విద్యుత్ కాంతిని వుపయోగించే సాధారణ మైక్రాస్కోపుల కంటే అతి సమర్థవంతంగా పని చేయగల లేసర్ కిరణాల మైక్రాస్కోపును జపాను లోని అంతర్జాతీయ వ్యాపారం, పరిశ్రమల మంత్రిత్వ శాఖకు చెందిన ఎలక్ట్రో టెక్నికల్ లేబరేటరీలో తయారుచేశారు. మామూలు ఆప్టికల్ మైక్రాస్కోపుల సూత్రం పైనే యివి కూడా పని చేస్తాయి. అయితే ఒకేరంగు గల లేసర్ కిరణాల వలన వస్తువు యొక్క ప్రతిబింబం మిగిలిన మైక్రాస్కోపులలో కంటే ఎంతో స్పష్టంగా కన్పిస్తుంది. పరిశోధకులు యీ మైక్రాస్కోపుతో, జంతు శరీర అంతర్భాగం లోని టిష్యూలను ఎంతో స్పష్టంగా చిత్రీకరించడంలో విజయాన్ని సాధించారు. వైద్య రంగంలోనే కాక, పారిశ్రామిక రంగంలోనూ, మరికొన్ని యితర రంగాలలోను యీ మైక్రాస్కోపు వుపయోగపడగలదని వీరు తెలియచేశారు

## నర్సింగ్ హోం

షాపుకే వెళ్ళేవాళ్ళు. రాధాకృష్ణ తమ్ముడు శివ తన షాపులో ఉన్న మందుల్నే యిచ్చేవాడు. వాళ్ళు తీసికెళ్ళి రమేష్‌కి చూపిస్తే

'యిది ఎందుకిచ్చేడు నేను రాసింది యీ మందు కాదే' అనేవాడు.

'మీ చీటీ చూపెడితే యీ మందు యిచ్చేడు'

'నేను రాసింది ఉంటే యివ్వమను. లేకపోతే డబ్బు తీసుకుని వేరేచోట కొనుక్కోండి'

'అతను పుచ్చుకోకపోతేనో' అనేవాళ్ళు పేషంట్లు

అమాయకత్వానికి జాలిపడుతూ 'ఎలా పుచ్చుకోడయ్యా! నేను వొకటి రాసిస్తే యింకోటి యిచ్చి పుచ్చుకోడంటే ఎలా ?'

'సరేసార్ ప్రయత్నించేస్తాం' అనేవాళ్ళు.

వాళ్ళు తిరిగి యిచ్చేస్తూంటే శివ "కంపెనీ వేరయ్యా. కాని మందు వొక్కటే. మీ డాక్టరు ఏ చెత్త కంపెనీదో మందు రాస్తాడు. అలాంటి కంపెనీ మందులు మేం పెట్టం మేం అంతా స్టాండర్డు కంపెనీ మందులే పెడ్తాం. ఆ చెత్త కంపెనీవాళు

మీ డాక్టరుకు కమీషను యిస్తారేమో!అందుకే యెప్పుడూ ఆ కంపెనీ మందులు తప్పితే యింకేం రాయడు'' అంటూ పెద్ద లెక్చరు యిచ్చి చాలా హీనంగా 'తీసుకోవయ్యా నీ డబ్బులు, పిచ్చిపిచ్చి కంపెనీల కల్తీ మందులే మీకు అచ్చొచ్చాయి' అంటూ డబ్బు పారేసి నంత పని చేసేవాడు.

అందుకే రమేష్ పేషంటుతో రాధాకృష్ణ షాపుకు వెళ్ళవద్దనేవాడు. 'మీరు ఎక్కడైనా కొనుక్కోండి అంతేకాని అక్కడ మాత్రం కొనకండి వొకదానికొకమందు యిచ్చేస్తాడు. ఆ మందు యిచ్చేసి డబ్బు తెచ్చుకోవాలంటే కాళ్ళు అరిగిపోయేలా తిరగాలి, ఎందుకంటే ఆ డబ్బులు ఖర్చయిపోతాయి. తిరిగి మీలాంటి వాళ్లెవరైనా టోపీ పెడితే, ఆ డబ్బు మీకు దొరుకుతుంది' అనేవాడు.

వొకసారి రమేష్ పేషంటు తాలూకు వాళ్ళతో అర్జంటుగా యీ మందులు తెప్పించండి అని కొన్ని మందులు రాసి 'మీరు వొక గంటలో తెండి ఎలా వాడాలో చెప్తాను' అన్నాడు.

ఆ పేషంటుకు వాంతులు విరోచనాలూ, పేషంటు భార్య తన చిన్న కూతుర్ని ఆరేళ్ళ దాన్ని తీసుకుని డిస్పెన్సరీకి వొచ్చింది. భర్త బాధ చెప్పి మందులు యివ్వమంది. 'అర్జెంటుగా యివి తీసుకురండి' అంటూ చీటి రాసిచ్చేడు రమేష్.

ఆమె శివ షాపుకు వెళ్ళి చీటీ యిచ్చింది. 'ఇంకో అరగంటలో వస్తాయమ్మా. మీరు డబ్బిచ్చి మీ పాపను యిక్కడ కూర్చోబెట్టి వెళ్లండి. నేను అరగంటలో మీ పాపను మందులతో పంపిస్తాను' అన్నాడు.

ఆ పిల్ల అక్కడ స్టూలుమీదకూర్చుంది. అరగంట, గంట, రెండు గంటలు అయింది. పది గంటలకు అక్కడ కూర్చున్న పాప గురించీ వొంటిగంటకు వాళ్ళ అమ్మ వొచ్చి 'ఏంటయ్యా, మందులు ఏవి?' అంది.

'తెచ్చేవాడికి యాక్సిడెంటయిందనీ వాళ్ళ తమ్ముడు వొచ్చి చెప్పేడమ్మా. ఇంకోగంటలో పంపించేస్తానన్నాడు వాళ్ళ తమ్ముడు. మీరు యింటికి పాపని తీసుకెళ్ళి భోజనం పెట్టి తిరిగి పాపని పంపించండి. నేను మందులు పాపతో పంపించేస్తా'నన్నాడు.

ఆమె కూతురుకి భోజనం పెట్టి వచ్చి దిగవిడిచింది.

సాయంత్రం నాలుగుకు వచ్చి తీసుకెళ్ళి కాఫీ, టిఫిను తినిపించి తిరిగి దిగబెట్టింది.

ఆరు గంటలకు ఎలాగయితేనేం మందులు ఆ పాప వెంబడి పంపించేడు

ఆరున్నరకు రమేష్ దగ్గరకు తీసికెళ్ళిందామె

'ఏంటమ్మా నేను అర్జంటుగా తెమ్మని ప్రొద్దున్న రాస్తే పన్నెండు గంటల తర్వాత తెచ్చేవు. ఇదేం అర్జంటు' అన్నాడు.

ఆమె జరిగిందంతా చెప్పింది.

రమేష్‌కి ఉన్నఫళంగా లేచివెళ్ళి ఆ శివాని తన్నిరావాలని అనిపించింది. 'ఏంటి యిలా పేషంట్సుతో ఆడుకోవడం? వాడికి తమాషాగా ఉందిగావి, నమ్మకం ఉంచుకున్న వాళ్ళ ప్రాణాలుపోతే' వీడికి గట్టిగా బుద్ధి చెప్పాలనుకుని తనే స్వయంగా శివుడి దగ్గరికి వెళ్ళి 'ఏంటి యిది' అంటూ గద్దించేడు.

శివుడు అయిదు అడుగుల రెండంగుళాల మనిషి వొణికిపోయి 'తప్పైందిసార్' అంటూ కాళ్ళు పట్టుకున్నంత పని చేసేడు— ఆరడుగుల రమేష్‌ని చూపి.

ఇంతలో చుట్టుపక్కల వాళ్లంతా చేరి ''వెధవాయ్ యిలాంటి పనులు చేస్తావేంటి ? మీ అన్న ఎంత మంచివాడు. ఎంత గౌరవ మున్నవాడు. యీ సంగతి తెలిసిందంటే చర్మం వొలుస్తాడు' అంటూ తలోమాట అనసాగేరు.

ఆ టైమప్పుడు ఎక్స్ కౌన్సిలర్ అటు వెళుతూ మెడికల్‌షాప్ ముందున్న గుంపుని చూపి ఆగి 'ఏంటండీ ?' అన్నాడు.

అందరూ అన్న మాటల్ని విని డాక్టర్ రమేష్‌తో 'డాక్టర్ మీరు వెళ్ళండి. నేను యిలాంటి పొరపాట్లు జరగకుండా చేస్తాను. ఏదో చిన్న పిల్లలవటం ఇంకా పెళ్ళిలు పేను కుని స్కూలుకు వెళ్ళిరావలసిన వయస్సు. ఏదో పెద్ద సంసార బాధ్యత తలమీద పడడం నించి వీళ్ళు యీ షాపులు పెట్టుకోవలసి వచ్చింది డాక్టర్. కుర్రవయసుకు పెద్దరికం ఎక్కడపించి వస్తుంది ? నేను తోవలోకి తెస్తాను. ఇకమీదట యిలాంటివి జరగవు' అంటూ రమేష్‌ని తోలించి గుమి కూడిన అందర్నీ పంపించి రాధాకృష్ణ క్లినిక్ వైపు బయలుదేరేడు.

*    *    *

విశ్వం కారు పది నిముషాల్లో శేఖర్‌ని తీసుకువచ్చింది. విశ్వం శేఖర్‌ని చూస్తూనే కుర్చీలోంచిలేచి 'ఎన్నాళ్లకు డాక్టర్ మిమ్మల్ని కలిపింది' అని అతనితో కరచాలనం చేస్తూ 'ఏంటి బాగా చిక్కిపోయేరు. వొంట్లో అస్వస్థతగా ఉందేంటి?' అంటూ ప్రశ్నించేడు.

'వొంటికి కాదు మనస్సుకి' అని రాజా వైపు తిరిగి 'వీరు...' అనబోతూంటే విశ్వం 'డాక్టర్ రాజా! వీరు డాక్టర్ శేఖర్ అని సర్జన్ మన గవర్నమెంటు హాస్పిటల్లో! వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ సర్జరీ అని వీరిని హాస్పిటల్లో పిలుస్తారు' అని 'వీ డాక్టర్ రాజా ప్రయివేట్ ఫిజీషియన్.'

శేఖర్ రాజాతో కరచాలనం చేసేడు.

ఇంతలో కాఫీ వొచ్చింది.



# నర్సింగ్ హోం

ముగ్గురూ వొక సిప్ తాగిన తరువాత 'ఏంటి శేఖర్ అర్ధాంతరంగా యీ రాక? ఫోన్ మీద అంత డిజెక్టెడ్‌గా ధ్వనించావేంటి?' అంటూ అడిగేడు.

'ఏం చెప్పమంటారు సార్, చాలా విసిగి పోయేను.'

ఇంతలో సీను వచ్చి రాజాతో 'సార్ రూం నెంబరు వన్ పేషంటు అన్నగారు వచ్చేరు. తాళం యిస్తే ఆయన్ని లోపలికి వొదిలి తిరిగి గేటు తాళం వేసి యిస్తాను సార్.'

'సార్ మీరు మాట్లాడుతూ ఉండండి.' అని లేచి శేఖర్‌తో 'ఎక్స్‌క్యూజ్ మీ డాక్టర్ నేను యిప్పుడే వస్తాను' అని గదినించి లోపలి తలుపు తీసుకుని నర్సింగ్‌హోంలోకి వచ్చి గేట్ దగ్గరికి వచ్చేడు గేట్ అవతల అయిదు అడుగుల తొమ్మిది అంగుళాల పొడుగులో వొత్తైన వల్లని జుత్తుతో మల్లెపువ్వు లాంటి స్వచ్ఛమైన బట్టల్లో ఎర్రగా అందంగా ఉన్న యువకుడు ఠీవిగా నిలబడి వున్నాడు. రాజా గేటు దగ్గరికి రాగానే యింటిమేటు సెంటు పరిమళం ముక్కుకు హాయిగా తగిలింది. గేటు ఊచల్ని పట్టుకుని ఉన్నతను 'సారీ డాక్టర్ మిమ్మల్ని డిస్టర్బ్ చేసేను. నేను కొత్త రూల్సన్నీ సీను దగ్గరి నించి యిప్పుడే విన్నాను. ఇరవై మైళ్ళ దూరంనించి వచ్చేను. ఇప్పుడు అంత దూరం వెళ్ళాలంటే యిబ్బందే. మీరు పర్మిషను యిస్తే...'

'సరే' అని సీనుకు తాళం యిచ్చి గేటు తెరిపించి అతన్ని లోనికి వదిలేడు. అతను లోనికి వస్తూ డాక్టర్‌కి థాంక్స్ చెప్పి 'ఎట్లా వుందేంటి డాక్టర్ మా సిస్టర్' అన్నాడు.

'నాకు తెలియదండీ, డాక్టర్ విశ్వంగారి కేసు అది.'

'నేను ఎప్పటినుంచో చెబుతున్నాను సార్ యిలా నాలుగు నెలలకోసారి అడ్మిట్ అయ్యే దానికంటే శుభ్రంగా ఆపరేషను చేసుకోమ్మా అని, కాని వొకటే మొండి ఘటం సార్ నా మాటే వినదు. దానికి ఆపరేషన్ అంటే భయం. మా బావకేమో ఎంతసేపూ పొలాలూ, డబ్బూ అంటాడు కాని భార్య ఎలా ఉందో అన్న దిగులే లేదు. మా నాన్నకు ఎంతసేపూ దీన్ని గురించే బెంగ. రెండేసి

గొజులకోసారి వెళి చూసిరా అంటూ ప్రాణం తీస్తాడు వెళకపోతే అసలు అన్నమే తినడు. ఈ తండ్రీ కూతుళ్ళ అభిమానాల మధ్య నేను తిరగలేక చస్తున్నాను సార్' అని 'నేను హియర్ల్రతం దాకా ఉండిపోతాను, మీకు అబ్జక్షన్ లేదుకదా సార్!'

'లేదు' అన్నాడు రాజా.

'థాంక్స్' అంటూ అతను వెళ్లిపోయేడు.

రాజా తిరిగివచ్చేటప్పటికి శేఖర్, 'అలా తయారయింది సార్ హాస్పిటల్ పదే పదే మీరే గుర్తుకొస్తారు సర్జన్ని తరిమి తరిమి కాషువాలిటీకి పోస్టు చేసేరు. నేను అక్కడ ఉండలేను సార్. మీరు నాకు సహాయంచేసి తిరిగి నా సర్జికల్ పోస్టింగు డాక్టర్ చంద్రశేఖర్ దగ్గరకాకుండా మరింకెక్కడయినా వేయించండిసార్. నేనుండే యీ ఆరునెలలూ ఎలానో అలా సర్దుకుపోయి సూపర్ స్పెషలైజేషన్‌కి వెళ్ళిపోతాను' అన్నాడు - బతిమాలుతూన్నట్టు.

సర్జరీలో మేధావి దురదృష్టం వించి యిక్కడ ఉన్నాడుకాని లేకపోతే చాలా పైన ఉండవల్సినవాడు యీరోజు తన్ను సర్జరీ వార్డుకి ట్రాన్స్‌ఫర్ చేయించమనీ అడుగుతున్నాడు. మన అడ్మినిస్ట్రేషన్ ఎలా తగలడింది అనుకుని శేఖర్‌తో 'చంద్రశేఖర్ సామాన్యుడు కాడోయ్. అతనికి ఎంపీలు, ఎం. ఎల్. ఏల బ్యాకింగ్ చాలా వుంది. నీ ట్రాన్స్‌ఫర్ కారణం అతను అని అందరికీ తెలుసు తిరిగి నేను కాదు ఎవరు ప్రయత్నం చేసినా లాభం వుండదు. వొకవేళ చేయించినా, ఆ ట్రాన్స్‌ఫర్ చేసిన అథారిటీ మీద పగబడతాడు. అందుకే ఎవరూ చేయరు.'

'సార్' అన్నాడు యింకా కృంగిపోతూ.

'అవును శేఖర్. నిన్ను వాళ్ళు బాధపెట్టడం నాకు బాధగానే ఉంది కాని ఏంచేయను' అని 'నీకు వొకప్పుడు చెప్పినమాటే తిరిగి చెబుతున్నాను. డాక్టర్ శేఖర్ నువ్వు నా అసిస్టెంటుగా చేరు. నేను యీ ఆపరేషన్ల వొత్తిడి భరించలేకపోతున్నాను. నువ్వుకూడా కలిస్తే నా బరువు షేరు చేసుకోవచ్చు.'

'సార్ నా రెప్యుటేషన్ మీరు ఎరగనిది కాదు. హాస్పిటల్‌లో అయితే ఫర్వాలేదు కాని ప్రయివేట్ ప్రాక్టీసులో-అలాంటి పేరు చాలా దెబ్బతీస్తుంది సార్' అన్నాడు.

'శేఖర్ ఆ సంగతి నీకంటే నాకు బాగా తెలుసు. నువ్వు చేపట్టిన కేసులు అలా ఉన్నాయి; నువ్వు ఆ ఆపరేషన్లు చేయకపోతే వాళ్ళు వారం రోజుల్లో పోయేవారు. చేసేవు కాబట్టి కనీసం రెండువారాలైనా బ్రతికేరు.'

'చాలా థాంక్స్ సార్ మీకు నామీద ఉండే అభిమానానికి' అని 'సార్...సరే మీ యిష్టం వొచ్చినట్టు చేయండి'

'అయితే యీరోజు ఎన్నిగంటలకు అయిపోతుంది నీ కాషువాలిటీ'

'వొంటిగంటవ్వరకు సార్' అన్నాడు.

'సరిగ్గా వొంటిగంటన్నరకు కారు పంపిస్తాను, నువ్వు తిన్నగా యిక్కడికే వొచ్చేయ్. ఇవాళ మధ్యాహ్నం రెండు జీజేలు ఉన్నాయి. రెండు హెర్నియాలూ, వొక ప్రాస్టేట్'

'సరేసార్ మీరు కారు పంపించకండి. కాషువాలిటీ అయిపోగానే నేను యింటికి వెళ్ళి భోజనం చేసి వచ్చేస్తాను.'

'నీ భోజనం మా యింట్లోనే యివాళ'

'వొద్దు సార్'

'ఫర్వాలేదోయ్!' అని డ్రైవర్ని కేకేసి 'డాక్టర్ని తీసుకెళ్ళి ఆసుపత్రిలో విడిచేయ్. తిరిగి వొకటిన్నరకు పికప్‌చేసుకోవాలి.'

ఆ రోజు విశ్వం చాలా సంతోషంగా ఉన్నాడు. తనకు ఎన్నాళ్ళనించో శేఖర్‌లాంటి అసిస్టెంటు కావాలి. ఇన్నాళ్ళకు ఆ కోరిక నెరవేరింది. ఆసుపత్రి విడిచేసిం తరువాత ముఖ్యంగా పోయింది కంపెనీ. అక్కడ అసిస్టెంట్లూ, హవుస్ సర్జన్లూ, స్టూడెంట్లూ చుట్టుముట్టి ఉంటే వాళ్ళందరి మధ్యా ఆపరేషను చేస్తున్నప్పుడుండే భావం— తను వొక్కడే థియేటర్‌లో ఆపరేషన్ చేస్తున్నప్పుడు రాదు.

తన ఆలోచనలకు స్వస్తిచెప్తూ 'ఎలా ఉందోయ్ నా ప్రపోజిషన్' అన్నాడు.

'చాలా బాగుందండీ. మీకు కాస్త ఖాళీ దొరుకుతుంది' అన్నాడు రాజా.

'ఎక్కడ ఖాళీ డాక్టర్' అంటూ డ్రాయర్ తెరచి అందులోంచి ఒక బౌండు పుస్తకం తీసి 'చూడండి' అంటూ రాజాకిఅందించేడు.

రాజా పుస్తకాన్ని తిరగేసేడు. అందులో నంబరువారీగా పేరులూ, వాటి ప్రక్కన ఎప్పుడో ఆరునెల్ల తరువాత వాటి తారీకు రాసి వుంది.

'ఇవన్నీ ఏంటి సార్' అన్నాడు.

'వాళ్ళందరూ ఆపరేషన్ నా చేత చేయించుకుందామనే వాళ్ళ పేరులు. నాకు తీరికలేక ఆరు నెలల తర్వాత రండి అంటూ అలా పంపించేస్తూనే ఉన్నాను.'

'ఆరు నెలలదాకా కేసు కాంప్లికేట్ కాకుండా ఎలా ఉంటుంది సార్' అన్నాడు ఆశ్చర్యంతో.

'అవన్నీ సింపుల్ కేసులే. అలాంటికేసుల్నే నేను పోస్ట్‌పోను చేస్తున్నాను.'

'అయితే వీళ్ళందర్నీ పిలిచి...!'

'అలానే అనుకుంటున్నాను కాని డాక్టర్ శేఖర్ ఏం అంటాడో. అతను ఛాలెంజింగ్ కేసుల్ని తప్పితే మరింకేం తీసుకోరు.'

'ప్రయివేట్‌గా అలాంటి కేసులు ఎలా వస్తాయి సార్.'

'రావు అనుకో అయినా ఉన్నవాటలో...'

'సార్ మన వోపీకేసులూ, నర్సింగ్‌హోం



కేసులూ యిన్‌వెస్టిగేషన్ గురించి మనం ఒక లాబ్ పెడితే సార్!'

'బాగానే వుంటుంది కాని దాని సూపర్‌వైజేషన్ ఎవరు చేస్తారేంటి?'

'నేను చేస్తాను సార్' అన్నాడు రాజా ఉత్సాహంగా.

'సరే అయితే, ఒక పదిహేను రోజుల్లో సైకాలజీ లాబ్ మొదలు పెడ్దాం. దానికి ఏమేం కావాలో చూడు.'

'సరేసార్' అన్నాడు రాజా

ఇంతలో వార్డుబాయ్ 'సార్' అంటూ పిలిచేడు రాజాని.

'ఏంటి?' అన్నాడు రాజా.

'మీ గురించి ఎవరో వచ్చేరు సార్' అన్నాడు.

తన కన్సల్టింగ్ చేంబరులోకి వెళ్ళాడు రాజా.

అక్కడ ఒక ముప్పైఅయిదేళ్ళావిడ దిగులుగా స్టూల్‌పై కూర్చొని ఉంది. తన్ను చూడగానే లేస్తూ 'నమస్కారం డాక్టర్' అంది.

'కూర్చోండి' అని తనూ కూర్చున్నాడు. 'చెప్పండి' అన్నాడు.

'నా కొడుకు సార్ వాడు యీ మధ్య మెంటల్‌గా తయారయేడు.'

'ఏన్నేళ్ళుంటాయి? ఏమయింది?' అని అడిగేడు రాజా.

'పదహారు' అంటూ కవరులోంచి ఒక ఫోటోని తీసి యిచ్చింది. ఆ ఫోటో బస్ పాస్‌లోనిది. కొంచెం పాతగా ఉంది. అందులో పెన్‌తో తలకు పొడుగుపాటి వెంట్రుకలూ, భుజంమీద జడలూ వేసి ఉంచేరు చొక్కా మీద చీరగీసి ఉంది, జడలో పూలు కూడా తురిమినట్లు గీసేరు. ఆ ఫోటోని దీర్ఘంగా చూసి ఆమెకు అందిస్తూ, ఫోటోకి ఆడ రూపం యిచ్చేరేంటి?' అన్నాడు.

'ఆడరూపంలో తను చాలా బాగా ఉంటానని అనుకుంటాడు ఆ కుర్రాడు. అయనే అవన్నీ గీసుకున్నాడు.'

'ఏదో చిన్నతరహా అంటూ కొట్టి వేయబోయేడు'

'కాదండి డాక్టర్ అదేం అంత చిన్న తరహాకాదు. తను ఆడపిల్లననే నమ్మకం ఉంది ఆ కుర్రాడికి. ఆ నమ్మకాన్ని నిజం చేసుకోవడానికి చాలా ప్రయత్నిస్తున్నాడు'

'అయితే యిది సైకియాట్రి కేసమ్మా,

# నర్సింగ్ హోం

మీరు సైకియాట్రిస్ట్‌కి చూపించండి'

'ఆ పనే చేసేం. డాక్టరు మొదట ఒక ఫిజిషియన్‌కు చూపించి తర్వాత రమ్మన్నాడు. అందుకే మీదగ్గరకి వచ్చేం.'

'మరి కుర్రాడేడి?' అన్నాడు.

'కాలేజీకి వెళ్ళేడండీ, మీరు ప్రేము ఎపాయింట్‌మెంట్ యిస్తే మా వాడిని తెస్తాను.'

డాక్టర్ రాజా కొంచెం ఆలోచించి మూడురోజుల తర్వాత ప్రొద్దున్న పదిగంటలకు తెమ్మని 'మీరు యీ చిన్న విషయానికి చాలా బెంగ పడుతూన్నట్టున్నారు అంత బెంగపడకండి, కొంచెం పిల్లవాడికి నచ్చచెబితే యింక ఇలాంటి ఆలోచనలే రావు'

---

### మృత్యువూ !

నువ్వెప్పుడు వస్తావో నాకు తెలీదు.
నువ్వేరూపంలో వస్తావో నాకు తెలీదు
నువ్వొస్తావని మాత్రం తెలుసు.
రా ! ...
దయచేసిరా !
నాలో అణువణువూ పొడుచుకు తిను.
నా కళ్ళను మాత్రం సజీవంగా మిగలనీ
ఎందుకంటే–
అవి నా 'ప్రియురాలి'ని చూడాలి !

— ఇమంది రామారావు

---

'వాడికి బుర్రలో కూర్చుండిపోయిందండీ తను అంతర్ముఖంగా ఆడపిల్లనని. యిప్పుడు రూపంకూడా మార్చుకుంటే తన కోరిక తీరుతుంది' అనుకుంటాడు మొన్న అంటే ఆరునెలల క్రిందట ఎక్కడో పుస్తకంలో చదివేడట ఎవరో సెక్సు మార్చుకున్నాడని! ఆ వ్యాసం చదివి దాన్ని ప్రచురించిన వాళ్ళకు ఉత్తరం రాసేడు అతని అడ్రస్ కావాలని. వాళ్ళు అడ్రస్ పంపించేరు. అతను అతనికి ఉత్తరం రాసేడు. అందులో అతని వ్యాసం చదివేననీ, తనకూ అతనిలాగే చిన్నప్పటినించీ అన్నీ ఆడపిల్ల లక్షణాలే ఉన్నాయనీ, మొగవాళ్ళను చూస్తే సిగ్గనీ, ఆడపిల్లల సమక్షంలో తను స్వేచ్ఛగా తనవాళ్ళమధ్య ఉన్నట్టు సంచరించగలడనీ, తనకు కూడా అతనిలాగే ఆపరేషను చేసి, అతనిలాగే ఆడగా మారి కొన్నాళ్ళకు ఏ మగవాణ్ణయినా పెళ్ళి చేసుకుని కాపరం చేయాలని ఉందనీ,రాసేడు అతను జాబుకి ఒకసారి మా వాడిని రమ్మని రాసేడు. వీడు ఎడ్యుకేషనల్ టూర్ అంటూ సగ్గాలు తాపు వెళ్లి రెండు రోజులు అతనితో ఉండి మాట్లాడి వచ్చేడు.'

'అతను ఆరు నెలలదాకా ఆపరేషను ముందు వాడిన మాత్రల పేరు తీసుకువచ్చి వాడడం మొదలు పెట్టేడు–' అంటూ కవరులోంచి ఒక కాగితం తీసి యిచ్చింది. అవి ఇస్ట్రోజెన్ మాత్రలు. వాటి విజృంభణవల్ల ఆడపిల్ల శారీరకంగా ఆడమనిషిగా పరిమాణం పొందుతుంది. 'ఇవి తీసుకుంటూంటే ఆరు నెలలలోంచి మావాడికి ఛాతీ కాస్త ఎత్తుగా తయారయింది. గడ్డాలు మీసాలూ పోనూ పోను అందే కుర్రాడిముఖం చాలా అసహ్యంగా తయారయింది' రాజా అన్నీ మర్చిపోయి ఆసక్తిగా వింటున్నాడు అతనికి అనుమానం వొచ్చింది! ఇవన్నీ యీమెకెలా తెలిసేయీ అని, తన అనుమానాన్ని అడిగేడు

దానికి ఆమె 'నా కొడుకే చెప్పేడండీ.'

'ఇలాంటి విషయాలు సిగ్గులేకుండా ఎలా చెప్పగలిగేడండీ?' అన్నాడు.

'అతను చెప్పలేదండీ, నేనే అతన్ని అడిగేను.'

'మీకు అనుమానం ఎందుకొచ్చింది?'

'మావారు ఆఫీసులో గుమాస్తా. అతను పని అయిన తరువాత ట్యూషన్లు చెప్పి తొమ్మిదింటికిగాని రారు. ఈ అబ్బాయి కాకుండా నాకో ఆడపిల్ల వుంది. మేం సినిమాలకు ఎప్పుడు వెళ్ళినా నా కొడుకు 'చదువుకుంటాను' అంటూ యింట్లో వుండిపోయేవాడు. క్లాసులో ఫస్టుమార్కు వాడిదే నేను సినిమా నించిగాని, పేరంటం నించిగాని, బజారునించిగాని వచ్చిన ప్రతిసారి నేను ఎక్కడ పెట్టిన వస్తువు అక్కడ వుండేది కాదు స్థాన భ్రష్టం పొంది ఉండేది. రోజులు గడుస్తూన్న కొద్దీ లీలగా ఉండే నా అనుమానం గట్టిపడసాగింది– తనులేనప్పుడు తన బీర్వాలోని చీరలు ఎవరో కదుపుతున్నారని! డస్సింగ్ టేబిలులో పున్నవస్తువులు ఎప్పుడూ పెట్టిన స్థలంలో వుండేవికావు.

దీనికంటే మొదలు ఒక నాలుగేళ్ళనించి నా కొడుకు రోజూ ప్రొద్దున్నే లేచి తలమీద పంచి స్నానం చేసేవాడు. కళ్ళకు కాటుక పెట్టుకుని అద్దం ముందు కూర్చొని తన్ను తాను వివిధ భంగిమల్లో చూసుకొనేవాడు.


నోటిగాలి క్లోస్ అప్‌లో వలె తాజాగా
పళ్ళపై తెలుపు క్లోస్ అప్‌లో అంత తెల్లగా
పారదర్శకమైన ఎరుపు
క్లోస్-అప్
టూత్ పేస్ట్ మరియు మౌత్ వాష్ ఒకే దానిలో
Close-up
Close-up
Close-up
ఇటువంటి సన్నిహితమైన సన్నివేశాలలోనూ, మీకు చేరువగా ఉండేవాళ్ళు దగ్గరగా వున్నప్పుడూ మీకు కావాలి, క్లోస్-అప్—యిది టూత్ పేస్టులలోనే ఒక కొత్త పద్ధతి, ఆలోచన. దీనిలో గల అపలైత మౌత్ వాష్, మీ నోటి గాలిని క్లోస్-అప్‌లో వలె తాజాగా ఉంచుతుంది—దీనిలో గల రెండు ప్రత్యేకమైన పదార్థాలు, మీ పళ్ళను క్లోస్-అప్‌లో అంత తెల్లగా చేస్తాయి.
క్లోస్-అప్
సన్నిహితులకోసం

## నర్సింగ్ హోం

ఏంతకు అద్దం ముందునించి కదలడు. ఆఖరికి కేకలేస్తేగాని కదిలేవాడు కాడు.

దీనికితోడు వంటింట్లో చేరడం. అంట్లు గిన్నెలూ, కప్పులూ కడగడం, ఇల్లు చీపురుతో వూడ్వడం, ఆడవాళ్ళు కబుర్లు చెపుతూంటే తనూ ప్రక్కన కూర్చొని మాటాడడం, ఇవన్నీ సంవత్సరాల తరబడి అలవాటు కావడం నించి మాకు వింతేం కనపడలేదు.

కాని ఏప్పుడయితే నేను పెట్టిన చీర మడతలు, నేను పెట్టిన విధంగా కాకుండా మరోలా వున్నాయో నాకు దీనికి కారణం ఏంటో తెలుసుకోవాలనిపించింది. అందుకే వొకరోజు సినిమాకి అని చెప్పివెళ్ళి వొకగంట తరువాత తిరిగి వచ్చేను. మా యింట్లో తలుపు ఇనపచువ్వలది కావడంనించి బయటి నుంచి చెయ్యి లోపలికి పెట్టి తలుపు తీయొచ్చు. చప్పుడు కాకుండా తలుపు తీసి లోనికి వచ్చి చూస్తునుకదా వీడు అద్దం ముందు- తన్ను తాను వోరచూపుల్తో చూసుకుంటున్నాడు. నన్ను చూస్తూనే బెదిరి లేచేడు. అప్పుడు వాడు నా పట్టుచీర, పట్టు జాకెట్, తల్లోపూలు- నుదుటబొట్టు మెళ్లో పూసలదండతో చాలా అసహ్యంగా భయంకరంగా కనిపించేడు. నేను గద్దించేటప్పటికి 'ఏంలేదు వొట్టినే' అంటూ భయపడిపోతూ చెప్పేడు.

నేను దబాయించేను 'ఏన్నాళ్ళనించో నా చీరలు నేను పెట్టినట్టుండటంలేదు. నేను సినిమాకిగాని, బయటికిగాని వెళ్ళిన ప్రతిసారీ నువ్వు యిలా చేస్తున్నావు' అంటూ...

'అవును' అంటూ వొప్పుకుని బావురుమంటూ ఏడుస్తూ అమ్మా నాకు ఆడదానిగా ఉండాలని యిష్టంగా ఉందే. యీ చొక్కా ప్యాంటులో కాకుండా చీరా జాకెట్టులో - యింట్లో ఆడపిల్లలాగే మెలగాలని ఉంది. నా కోరిక తీర్చవూ అంటూ హృదయం కదిలించేలా అడిగేడు.

వాడి భావాలకు నేను భయపడిపోయేను. వాడి మాటలు ఏదో ఆటబొమ్మ కొని యివ్వవూ అన్నంత మామూల్మలుగా ఉన్నాయి.

'వొరేయ్ ఎవరేనా వింటే నవ్విపోతా రా, యిలాంటి మాటలు మాట్లాడకు' అన్నాను.

'ఎవరూ నవ్వరమ్మా ఇది ప్రపంచంలో జరుగుతూందమ్మా నన్ను కాదనకు' అంటూ

వాడు కాళ్ళు పట్టుకున్నాడు.

ఇంటర్ చదువుతూన్న కుర్రాడు అలా అంటూంటే, వాళ్ళమ్మ మనస్థితి ఎలా ఉంటుందో మీకు తెలుసుగా డాక్టర్

చీదరింపుతో నామీద నాకు స్వాధీనం తప్పుతూండగా 'షటప్' అన్నాను.

వాడు తల వొంచుకునే అంతా ఆడపిల్ల భంగిమతో 'అమ్మా! నువ్వు అర్థం చేసుకోలేదా నా బాధ' అన్నాడు.

అందరిలా ఉండక నా కొడుకు యిలా విలా తయారయేడు అని తలపట్టుకున్నాను. తిరిగి వాడే 'అమ్మా నన్ను యిక్కడ డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళి ఆపరేషను చేయించమ్మా నేను యీ మొగ బ్రతుకు బ్రతకలేను'

'హారేయ్ మీ నాన్నకు చెప్పి నీకు తగిన బుద్ధి చెప్పిస్తాను'

'ఎవరికి చెప్పినా నేను యీ మొగబ్రతుకు మాత్రం బ్రతకలేను' అంటూ వార్నింగిచ్చేడు.

ఆ రోజు నించీ నన్ను చిత్రవధ చేస్తున్నాడు. నేను వీడితో యీ విషయం ఎందుకు కదిల్చేనా అని యిప్పుడు బాధ పడుతున్నాను. నేను యింట్లో లేనప్పుడే దొంగతనంగా వాడి యిష్టం వొచ్చినట్టు ఉండేవాడు కాని యిప్పుడో? నేను ఉన్నప్పుడు కూడా.'

'ఎందుకేంటి?' అన్నాడు డాక్టర్ రాజా.

వాడు నా ముందరే యిప్పుడు చీరా జాకెట్టు కట్టుకోవడం మొదలు పెట్టేడు. తల్లో పూలు పెట్టుకుని- ఏదో ఆలోచిస్తూ కూర్చుంటాడు పరధ్యాన్నంగా.

వాడి వ్యవహారం నేను చూడలేకపోతున్నాను డాక్టర్. అందుకే సైకియాట్రిస్టు దగ్గరికి వెళ్ళేము. అతను ఫిజీషియన్‌కి చూపించమన్నారు. మొన్న మీ దగ్గరకు సుబ్బయ్య సీరియస్ అయి వొచ్చేడటగా? అతన్ని మీరే బ్రతికించేరటగా! అతనే మా పురోహితుడు. మీ దగ్గరకే వెళ్ళమని మరీ మరీ చెప్పి పంపించేడు.'

'మీరు డాక్టరు దగ్గరికి రమ్మంటే వొస్తాడా మీవాడు' అంటూ అనుమానంగా అడిగేడు.

'రావచ్చు రాకపోవచ్చు. నూటికి తొంభై వంతులు వస్తాడనే అనుకుంటాము. వాడు డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళు అంటూ ఏన్నాళ్ళనించో నా ప్రాణాలు తీసేస్తున్నాడు.'

'సరే మూడురోజుల తర్వాత తీసుకురండి.'

# పురాణ పథం




## అగ్ని గర్వభంగం

మహర్షులలో దూర్వాసుడు మహా కోపిష్టి అని అందరికీ తెలుసును కారణం లేకుండా శపించడం అతనికి పరిపాటి. ఒకప్పుడు అతడు అగ్నిదేవుణ్ణే శపించాడు. అగ్నికి పట్టరాని కోపం వచ్చింది. అతడు ఆ మహామునిని ఏమీ అనలేక - అతనిమీద కోపం కొద్దీ ముల్లోకాలనూ దహించడానికి సిద్ధపడ్డాడు. అతని జ్వాలలు అన్ని దిక్కులా వ్యాపించసాగాయి. లోకాలు గడగడ లాడినవి.

అప్పుడు శ్రీహరి ఒక బాలుని రూపంతో అగ్ని యెదుట నిలబడ్డాడు. అగ్ని జ్వాలలు తగ్గిపోయాయి. ఆ బాలుడు అగ్నికి నమస్కరించి "వహ్నిభట్టారకా! లోకాలని దహించాలని నీకెందుకు బుద్ధి పుట్టింది? నిన్ను దూర్వాసుడు శపిస్తే, ఆ కోపంతో విశ్వమంతటినీ దహించడం ఏం ధర్మం? నీకు శక్తి వుంటే నిన్ను శపించిన ఆ మునికే తగిన గుణపాఠం బోధించాలిగాని, అందరినీ నశింపజెయ్యడం వింత మాత్రం ఉచితంకాదు. బ్రహ్మ సర్వాన్నీ సృష్టిచేస్తే, విష్ణువు పోషిస్తాడు. అవసానకాలం వచ్చినప్పుడు శంకరుడు సంహారం చేస్తాడు. సంహారకార్యం శివునిదే కాని నీదికాదు. మరి నీవే మహాశక్తి కలవాడినని భావించి ఈ ఘోరకార్యానికి పూనుకున్నావు నీకా శక్తి భగవంతుడిచ్చినదే కదా! శక్తి వున్నవాడు లోకానికి మేలు చెయ్యాలి. కీడు చెయ్యకూడదు ఆ శక్తి నీ స్వంతమనే అనుకుంటే ఏదీ ఈ ఎండు టాకును దహించు" అని ఎదుటవున్న ఒక ఎండుటాకును చూపాడు అగ్ని ఎంత జ్వలించినా ఆ ఆకు కాలిపోలేదు. పచ్చి ఆకులాగనే ఉండిపోయింది. అగ్నిదేవుడు ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. ఆ బాలుడు కూడా అగ్నిజ్వాలల నడుమ చెక్కు చెదరకుండా నిలబడి వున్నాడు. అంతటా చల్లదనమే వ్యాపించి వుండినది. "ఒక బాలుడి ముందు నేను ఎంత చేతకాని వాడిని అయిపోయాను?" అని అగ్నిదేవుడు సిగ్గుపడి తలవంచుకున్నాడు "తనకు శక్తిని ఇచ్చినవాడూ, తీసుకున్నవాడూ ఆ భగవంతుడే అనీ, తనలో ఏమీ లేదనీ" అప్పుడు అతనికి అర్థమయింది.

వెంటనే ఆ బాలుడు మాయమైనాడు. తన గర్వాన్ని అణచడానికే భగవంతుడు ఈ రూపంలో వచ్చాడని అగ్నిభట్టారకుడు అప్పుడు గ్రహించాడు.

---

ఆమె లేచి అతని టేబులుమీద యిరవై రూపాయలు పెట్టి 'వొద్దు' అని అనేలోపలే వెళ్ళిపోయింది.

తర్వాత యీ రోజు ఆపరేషను చేయవలసిన ఆరుకేసులూ ఫిజికల్లీ ఫిట్టా కాదా అని టెస్టు చేయాలి. తను పాస్ చేస్తేకాని విశ్వం ఆపరేట్ చేయరు. ఆరు కేసులు టెస్ట్ చేయాలంటే రెండు గంటలు అవుతుంది. డా॥ విశ్వం ప్రతీకేస్ టెస్ట్ చేసినందుకు ముప్ఫయి రూపాయల కన్‌సల్టేషన్ ఫీజు పేషంటుచేత యిప్పిస్తారు. ఆ టెండరుకి నివరేవాతపే కూర్చోపెట్టి తనకు చెప్ప వలసిందని, తను నర్సింగ్‌హోంలో వుంటానని చెప్పి నర్సింగ్‌హోంలోకి నడిచేడు. రూం నెంబరు వొకటో గదినించి గట్టిగా నవ్వులు వినపడుతున్నాయి.

'ఏంటి వీళ్ళు యింత మేనర్సు లేని మనుషులేంటి చెప్మా? నవ్వుకుంటే మెల్లగా నవ్వుకోవాలిగాని యింత గట్టిగానా? ఇదేం నర్సింగ్‌హోం అనుకున్నారా? హోటలు అనుకున్నారా?' అని తలుపు దగ్గరికి వచ్చి గట్టిగా తలుపు తోసేడు. తలుపు లోపలినించి గడియ వేసి వుంది. గట్టిగా బాదేడు.

## నర్సింగ్ హోం

'ఎవరు?' అంటూ అతని గొంతుక.

'నేనే డాక్టర్ రాజాని తలుపు తీయండి' ఆజ్ఞాపిస్తున్న ధోరణి.

రెండు నిముషాల తర్వాత తలుపు తెరవబడింది. నవ్వుతూ అతను లుంగీలో ఉన్నాడు. 'ఏంటండీ డాక్టరుగారు?' అన్నాడు.

'మీ గదిలోంచి నవ్వులు... అదీ యింత గట్టిగా...!'

'సారీ డాక్టర్. మా చెల్లెలికి నన్ను చూస్తే నొవ్వాగదు. రోజుల తరబడి వొంటరిగా వుంటుంది కాబట్టి తనవాళ్ళెవరేనా కనబడితే అదంతే అండి! దాని ప్రవర్తనకు నేను క్షమాపణ కోరుకుంటున్నాను ఏం అనుకోకండి.'

'సరే' అని తన కోపాన్ని తగ్గించుకుంటూ 'యికముందు యిలాంటివి జరగకుండా చూడండి' అంటూ వెళ్ళిపోయేడు.

కేసులు సింపులుగా ఉండటంవించీ వొంటి గంటన్నరకు పూర్తి చేసేడు రాజా.

అలసిపోయి విశ్వం దగ్గరికి వచ్చేడు. అతని గది ముందు యింకా నలుగురు వున్నారు పేషంట్లు. వీళ్ళుగాక రిప్రజెంటేటివ్స్ వొకపదిమంది.

ఇదంతా పూర్తి కావాలంటే మూడు పైనే అవుతుంది తర్వాత సర్జరీ, అది పూర్తికాగానే వోపీ

విశ్వం గదిలోకి వెళ్తే అతను కూర్చోపెడతాడు. అందుకే లోనికి వెళకుండా బయటపడ్డాడు.

ఈ రోజు తను మంజుకు తప్పకుండా ఉత్తరం రాయాలి. అందులో డాక్టర్ శేఖర్ గురించి కూడా రాయాలి. డాక్టర్ శేఖర్ తన్ను ఎందుకో చాలా బాగా ఆకర్షించేడు. అతని ముఖంలో వింత అమాయకత్వం ఉంది. అతని డ్రస్సింగో! స్కూలు పిల్లాడులా సింపుల్‌గా ఉంది. ఏమీ తెలియని వాడులా ప్రవర్తిస్తాడు. తన్ను మంజుల అంటూండేది 'రాజా నీ అంత సింపుల్‌గా ఎవరూ ఉండరని, కాని మంజు శేఖర్‌ని చూస్తే ఏం చెబుతుందో ?'

మంజు గురించి తలపులు పులకిస్తూండగా యింటివైపు సాగిపోసాగేడు రాజా.

(ఇంకా ఉంది)


మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది-చార్మినార్!
CHARMINAR
THE VAZIR SULTAN
TOBACCO CO. LTD.
10 CIGARETTES

# తల్లి మనసు

సీతాలక్ష్మిరాజ్



రాజేష్ హడావిడిగా టిఫిన్ తిన్నాననిపించి చకచకా వెళ్ళిపోయాడు. అతను తిని పడేసిన ప్లేటువైపు చూసి నిట్టూర్చింది రాజేశ్వరి. ఆ నిట్టూర్పులో ఎంతో ఆవేదన, ఆరాటం, లీలగా మెదిలే నిరాశ. రెక్కలు ముక్కలు చేసుకుని వంశోద్ధారకుడి కోసం రక్తం చెమటగా మార్చి, శ్రమని వెచ్చించి రూపాయలుగా తెచ్చి కొడుకు చేతిలో పోసి ఎంతో ఆశతో ఫలితం ఎదురుచూసే భర్త రామనాథం గుర్తు రాగానే రాజేశ్వరి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లినాయ్.

ఒక గుమాస్తాగా తన గానుగెద్దు జీవితాన్ని ఈడుస్తూ తన ఒక్కగానొక్క కొడుకు కోసం అహర్నిశలూ ఆరాటపడే రామనాథం ఆవేదన అర్థం చేసుకోలేడు రాజేష్. ఆయన ఆవేదన యిది అని చెప్పటానికి మాటల కందని భాష. తాము తిన్నా తినకపోయినా బిడ్డల భవిష్యత్ ముఖ్యంగా భావించే తల్లిదండ్రులలో రామనాథం దంపతులు ఒకరు.

రాజేష్‌కి అవేవీ పట్టవు. తనకు కావల్సినవి అమరినయ్యా లేదా? అడిగినప్పుడు కావల్సిన డబ్బు అమ్మా, నాన్న యిచ్చితీరాలి, అన్నదే అతని పాలసీ. గొప్పింటి శ్రీమంతుల బిడ్డల స్నేహాలకు అలవాటుపడిన రాజేష్ కాలేజీలో కాలర్ ఎగరేసి తిరగటం, అమ్మాయిల వెనకబడి కామెంట్ చేయటం, పిక్నిక్‌లనీ, పార్టీలనీ కాలం సద్వినియోగ పర్చటం అతనికి జీర్ణించుకుపోయిన అలవాట్లు.

రోజూ మాదిరిగానే రాజేశ్వరి కొడుకు లేచేసరికి టిఫిన్, కాఫీ తయారుచేసి పెట్టింది. శ్రీమంతుల బిడ్డల స్నేహాలేమో! తల్లి పెట్టే టిఫిన్ అంతగా రుచించలేదు. రాజేష్ తిన్నాననిపించి సగం ప్లేటు అలా వదిలేసి, కొద్దిగా సిప్‌చేసిన కాఫీ కప్పు నిర్లక్ష్యంగా పెట్టి వెళ్ళిపోతున్న కొడుకు ప్రవర్తనకి కుమిలిపోక ఏం చేస్తుందా తల్లి? తన కొడుకు ''అమ్మా'' అని ఆప్యాయంగా పిలిస్తే కరిగి పోవాలన్న ఆశ అడియాశ అయింది రాజేశ్వరి పట్ల. అలాస్థాణువులా ఎంతసేపు నిలబడిందో రాజేశ్వరికే తెలీలేదు. ఒక్కొక్కసారి ''నేనే రాజేష్‌ని అర్థం చేసుకోలేక పోతున్నానా'' అని ఆత్మ విమర్శన చేసుకునేది. కాని గజిబిజిగా వచ్చే ఆలోచనలకు ఒక రూపం అంటూ లేక పోయింది. ''దొరలాగా వున్నాడు పేరుకి

తగిన కొడుకు'' అని ప్రక్కింటి పంకజం పొగుడుతూవుంటే, ఆ 'తల్లి మనసు' ఆనందంతో పరవళ్ళు తొక్కింది. కానీ ... ఆత్మ సౌందర్యం కోల్పోతున్న తన బిడ్డ కోసం ఆత్మ ఘోషించింది.

తను యింటి పనులతో సతమతమౌతూ, తన బిడ్డ భవిష్యత్ బంగారు బాటలో పయనించాలన్న ఆశతో బట్టలుకుట్టి యిరుగు — పొరుగు వారికి పన్లు చేసిపెట్టి ఆర్జించిన దానితో రాజేష్‌కి ఏ లోటూ రాకుండా చేసింది. రేపు తన బిడ్డ పెద్ద ఆఫీసరైతే తాను నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చవచ్చును. ఈనాడు పడ్డ ఈ శ్రమంతా మర్చి హాయిగా ఊపిరి పీల్చుకోవచ్చును అనుకుంది. రాజేష్ ఒక్కొక్క క్లాసు పాస్ అయి కాలేజీలో చేరిన రోజున రాజేశ్వరికి చెప్పలేని ఆనందం కల్గింది పాయసం చేసి కొడుకుచేత స్వయంగా తన చేతో తినిపించింది. ఆనాడు రాజేష్ అన్న మాటలు యింకా తన చెవులలో మారు మ్రోగుతూనేవున్నాయ్. ''అమ్మా ! నీలాంటి అమ్మని పొందిన నేను ఎంత అదృష్టవంతుణ్ణి'' ఆ మాటతో రాజేశ్వరికి సంతోషం అనిపించింది. అతని తలవంచి నుదుటిపై ముద్దు పెట్టుకుంది. ''బిడ్డల భవిష్యత్ బంగారు బాటలో నడవటానికి తల్లిదండ్రులు పడేశ్రమ శ్రమ అనిపించదు. ఫలానావారి బిడ్డ అని గుర్తింపు కన్నా యింకా ఏంకావాలి బాబూ ?'' అన్నది రాజేశ్వరి, చెమ్మగిల్లిన తన కళ్ళను పమిటకొంగుతో తుడుచుకుని.

అటువంటి రాజేష్ కాలేజీలో చేరిన ఆరు నెలలకే తల్లి వునికి మర్చిపోయాడు. అమ్మ — నాన్న తనకి అమర్చిపెట్టే పనివాళ్ళుగా భావిస్తున్నాడు. ఇంట్లో చేసే తిండి నోటికి రుచించదు. అడిగినంత డబ్బు యివ్వని రోజున నానా గోల. ఈ రాజేష్ తన రాజేషేనా అన్న అనుమానం ఒక్కోసారి రాజేశ్వరికి రాకపోలేదు. తను కట్టుకున్న ఆశాసౌధాలు ఒక్కొక్కటిగా గాలిమేడలలాకూలిపోతున్నట్లు, పిడుగులు తనమీద పడుతున్నట్లు అనుభూతి కల్గినప్పుడు రాజేశ్వరి ఆపాదమస్తకం వణికిపోయింది. ప్రక్కింటి పంకజం పిలుపుతో ఈ లోకంలోకి వచ్చిన రాజేశ్వరి, కర్తవ్యంలో మునిగిపోయింది.

''చూడు రాజేశ్వరి! రాత్రికి మా పిల్లల బట్టలన్నీ పూర్తిచేసి యివ్వు. ఆఁ అన్నట్లు మరికొన్ని బట్టలు మా అమ్మాయికిచ్చి పంపిస్తాను. సమయానికి మాత్రం అందచెయ్యి, రేటు ఎక్కువ తీసుకున్నా సరే'' అంది పంకజం.

''అలాగే'' అంది రాజేశ్వరి. మిషన్ నడుపుతున్నదన్న మాటేకాని యాంత్రికంగా చేతులు పనిచేస్తున్నాయి. ధన్ ధన్ మన్న శబ్దంకన్న మరీ హోరుగా ఆలోచనలు తన మస్తిష్కంలో చేరి జోరీగల్లా రొద పెడుతున్నాయి.

దోషం తన రక్తంలో వున్నదా ? తన పెంపకంలో వున్నదా ? కాలంలో వున్నదా ? తనకి అర్థం కాలేదు. తల్లి ఆవేదనతో పనిలేని రాజేష్ తిరిగి తిరిగి మత్తుగ యిల్లు చేరుకున్నాడు.

కొడుకుని ఆ స్థితిలో చూసిన ఆ తల్లి మనసు ఆక్రోశించింది. తూలుతూ తల్లిని తప్పించుకుని వెళ్తున్న కొడుకుని కన్నీటికి నోచని ఆ తల్లి కళ్ళు జీవం కోల్పోయినట్లు చూస్తుండిపోయినయ్యి. ఈ చెంపా ఆ చెంపా పగలగొట్టాలని, ఏమిటీ పని అని నిలదీయాలని అనుకుంది. తనంత ఎదిగిన కొడుకు ప్రవర్తనకి ఏమీ అనలేక అవాక్కయిపోయింది.

ఒకనాడు ఏదో మాట మీద వచ్చి ''కాలేజీలకు వెళ్ళి చదువుకోమని పంపే తల్లిదండ్రులకు, వీళ్ళు చేసే తంతు తెలీదు. రెక్కలు ముక్కలు చేసుకుని కట్టెలుకొట్టి సంపాదించి పెట్టే తండ్రులు కొందరైతే, పాచిపన్లు చేసి ఒళ్ళు హూనం చేసుకుని కడుపు కట్టుకుని బిడ్డల కోసం కూడపెట్టి చదివించే తల్లులు కొందరు. అలాంటి తల్లిదండ్రులకు తమకు రాని చదువు బిడ్డలకి రావాలని, వారు గొప్ప భవిష్యత్ పొందితే చూసి ఆనందించాలనుకునే తల్లిదండ్రులకు వీళ్ళు యిచ్చే ఫలితమిదా... అమ్మా ! వాళ్ళలాగా నేను చెయ్యను. మా అమ్మని యిక కష్టపడనివ్వను. నీ శరీరానికి విశ్రాంతి యిస్తాను. నిన్ను పూలతో పూజిస్తాను'' అన్న రాజేష్... ఈనాడు తను కళ్ళతో చూసింది నిజమా, కలా ? కలత చెందిన మనసుతో కరిగిపోయిందా రోజు.

''నాకు వంద రూపాయలు అర్జంటుగా కావాలి'' అన్నాడు మర్నాడు రాజేష్.

''వంద రూపాయలా ?'' రాజేశ్వరి పెదవులు అస్పష్టంగా గొణిగినాయ్.

''ఎందుకు ?'' అప్రయత్నంగా అడిగింది.

''ఫీజు కట్టాలి'' ఆ సమాధానంలో నిర్లక్ష్యం స్పష్టపడింది.

రోజంతా ఒళ్ళు హూనం చేసుకుని కూడబెట్టిన యాభై రూపాయలు మాత్రం తీసి యిచ్చి ''యింత కన్న నా దగ్గరలేవు'' అంది రాజేశ్వరి.

విసురుగా ఆ డబ్బు తీసుకుని చేసిపెట్టిన టిఫిన్ వదిలేసి వెళ్తున్న కొడుకుని చూస్తూ బరువుగా నిట్టూర్చింది. అతను వెళ్ళినా అతను వాడిన ఖరీదు గల సెంటు మాత్రం రాజేశ్వరి ముక్కుపుటాలను తాకింది. ''నువ్వు పులుముకుతిరిగే ఆ సెంటు మా రక్తంబొట్లు వెచ్చించిన డబ్బుతో కొన్నదే! నువ్వు పారేసిన ఎంగిలిబ్రతుకులు మావి! నీలాంటి స్వార్థపరుణ్ణి కన్న మేము దురదృష్టవంతులం !'' ఎన్నో అనాలని అనుకుంది కానీ పెదవి కదపలేకపోయింది. తాము కంటిపాపలా సాకింది ఈస్వార్థపరుణ్ణా? అని వాపోయింది. తన బిడ్డ డిగ్రీ చదివి ఫస్టున పాస్ అయితే ఏ అమ్మ కాళ్ళో, ఏ అయ్య కాళ్ళో పట్టుకుని ఉద్యోగం వేయించి తాము పడ్డ శ్రమంతా మర్చిపోయి, నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చుతూ, విశ్రాంతి కోసం ఆరాటపడ్డ రాజేశ్వరికి మిగిలింది ఆవేదన. తీరని ఆవేదన. బిడ్డ కష్టపడి చదువుకుంటున్నాడని ఎంతో శ్రమించి అతనికి అమర్చిపెట్టింది. కాని ఈనాడు చదువు సంస్కారం చట్టుబండలై, ఒక చదువులేని హీనుడు చేసే పని చేసాడు. విద్య విజ్ఞానాన్ని గరుపుతుందని ఎంతో ఆశపడింది. అక్కడా యిక్కడా పుస్తకాలు, పెన్నులు, పెన్సిళ్ళు అడిగి తెచ్చి కొడుకు చదువు నిరాటంకంగా సాగాలని ఆశపడింది. కానీ... కాలేజీలకు వెళ్ళి నేర్చుకునేది యిదా ?

## గమనిక

వ్యక్తుల పేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరు పైన లేదా కార్డు పైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ– 520 003 అన్న చిరునామాకి పంపండి.

సం.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1981 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కధానికలపోటీ పెడుతున్నాము... పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

## ముగింపు తేదీ 14-9-'81 సోమవారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **600**, రు. **500**, రు. **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

- ★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నాలుగు పేజీలు మించకుండ వుండాలి 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
- ★ కధావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి
- ★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు
- ★ పై అంశాల మేరకు హామీపత్రం ప్రతి కథతోపాటు విడిగా వుండి తీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
- ★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయం తోనే వేస్తాము
- ★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫోటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి
- ★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము పోటీకి పంపిన కథలను ఏటి పరిస్థితులలోను తిప్పి పంపలేము

సం॥

# తల్లి మనసు

దీనికోసం అంత డబ్బు తగలెయ్యనవసరం లేదు. అంత దూరం వెళ్ళి కాలేజీలలో వెంగబెట్టనవసరంలేదే! అట్లా ఎంతసేపు ఆలోచించిందో రాజేశ్వరికే తెలీదు. "రాజేశ్వరీ... రాజేశ్వరీ" అని ఆదుర్దాగా పిలుస్తున్న ఎదురింటి పార్వతమ్మ కుదిపే కుదుపుకి ఈ లోకంలోకి వచ్చింది రాజేశ్వరి.

"ఏమిటన్నట్లు చూసింది?" ఆ చూపులో నిరాశ తొంగిచూసింది.

"నీ కొడుక్కి యాక్సిడెంట్ అయిందట! హాస్పిటల్‌లో చేర్చారు. ఇప్పుడే మా రవివచ్చి చెప్పాడు. త్వరగా రా" అంటున్న పార్వతిని చూస్తుండిపోయింది రాజేశ్వరి.

"ఏమిటలా వుండిపోయావ్? త్వరగా రా' అని దాదాపు లాక్కుపోయినట్లు చెయ్యిపట్టి తీసుకుపోయింది పార్వతి.

కొడుకు అచేతనంగా పడివున్నాడు. రాజేశ్వరి గుండెలు పిండినట్లయింది. మాతృప్రేమ పెల్లుబికి వచ్చింది. "బాబూ రాజేష్" అని గుండెలు అవిసేలా ఏడ్చింది. "చూడమ్మా! నీ కొడుక్కి రక్తం ఎక్కిస్తే కాని బ్రతకడు. ప్రస్తుతం రక్తం స్టాక్ లేదు" అన్న డాక్టర్‌ని చూస్తూ, "నా కొడుకుని ఎలాగైనా బ్రతికించండి డాక్టర్! వాడికన్నా నా ప్రాణం ఎక్కువ కాదు" అంది రాజేశ్వరి.

చకచకా పరీక్షలు జరిగిపోయినయ్యి. తన రక్తం ఒక్కొక్క బొట్టు తన శరీరం నుండి పోయి కొడుకు శరీరంలోకి ఎక్కుతోంది. మర్నాడు రాజేష్ నీరసంగా కళ్ళు తెరిచాడు. "బాబూ రాజేష్" అంది రాజేశ్వరి.

"అమ్మా" అన్నాడు రాజేష్.

"తన రక్తం ధారపోసి నిన్ను బ్రతికించుకుంది–మీ అమ్మ" అన్న డాక్టర్‌ని, కొడుకు కోసం ఆరాటపడే తల్లినీ మార్చి మార్చి చూసాడు రాజేష్.

"అమ్మా! నన్ను క్షమించగలవామ్మా" అన్నాడు, హృదయ పూర్వకంగా రాజేష్.

"కొడుకు ఎన్ని తప్పులు చేసినా తల్లి మనసు క్షమిస్తుంది రాజేష్" అన్న తండ్రి వైపు పశ్చాత్తాపంతో చూశాడు రాజేష్.

"నువ్వు నాకు దక్కావు! నాకంతే చాలు బాబూ" అంది ఆ "తల్లి మనసు". ★

# ఎదురుచూపు

## కొండముది రుక్మిణీదేవి

పెద్ద కథ

11

(గత సంచిక తరువాయి)

బస్సు వేగంగా వెళ్తున్నది. అంతకంటె వేగంగా మోహన్ ఆలోచన్లు పరుగెడుతున్నయ్!

"చేజారిపోయిందనుకున్న రత్నం అనుకోకుండా లభించింది. తను అదృష్టవంతుడు. మాధవి అన్నట్లు పెద్దవాళ్ళనుంచే ఆమెకు ఆహ్వానం అందాలి. అప్పుడే ఆమెకు తృప్తి. తనకు ఆనందం. చదువుకున్నాడు, సంస్కారం తెలిసినవాడు. అయినా తల్లిదండ్రుల్ని త్రోసి రాజనే మనస్తత్వం కాదు తనది.

మాధవి సూటిగా ఎలా ప్రశ్నించింది? తన బలహీనతలన్నీ తనకు తెలియజెప్పింది. చివరగా, "నామీద మీకు ప్రేమ వుండవచ్చు. కానీ బ్రతకటానికి ప్రేమ ఒక్కటే చాలదు. కుటుంబ సభ్యుల ఆప్యాయత, సంఘంలో గౌరవం, పరువు, మర్యాద అన్నీ కావాలి. ఆ ఆదరణ, ఆప్యాయతే నాకూ కావాలి. మీవాళ్ళను ఒప్పించి, తీసుకురండి" అన్నది.

అమాయకంగా కనిపించే ఆమెలో ఇన్ని భావాలు, ఇంత పట్టుదల వున్నాయని తను వూహించలేదు. ఇప్పుడే చెబుతాను. వెంటనే నిన్ను నా దగ్గరకు రప్పించుకుంటాను. మనిద్దర్నీ మరెవ్వరూ విడదీయలేరు." బస్సు సడన్‌బ్రేకు వేసి ఆపాడు డ్రైవరు. దాంతో మోహన్ ఆలోచన్లూ ఆగిపోయాయి.

* * *

హుషారుగా గుమ్మంలో అడుగుపెట్టిన కొడుకుని చూసి "ఇంటర్వ్యూ బాగా చేశావా? అపాయింటుమెంటు ఆర్డరు ఇచ్చేశారా?" ఆత్రంగా ప్రశ్నించాడు తండ్రి.

"ఇంటర్వ్యూ బాగానే చేశాను. పది రోజుల్లో రిజల్టు వస్తాయి."

"సీతమ్మ అత్తయ్యకు ఎలా వుంది? చూసొచ్చావా?" అన్నం పెడుతూ అడిగింది సుశీలమ్మ.

"అత్తయ్యనే కాదు, మాధవినీ చూసొచ్చాను."

"మాధవినా! ఎక్కడ?" ఆశ్చర్యంగా అడిగింది.

"అత్తయ్యకు సేవ చేస్తూ..." ఇహ చెప్పలేక పోయాడు.

సుశీలమ్మకు కొండంత భారం తొలగినట్లయింది. కొడుకులో వెనకటి కళ, ఉత్సాహం చూసి ఆ మాతృ హృదయం పొంగిపోయింది. "ఒక అమాయకురాలికి అన్యాయం చేశానా" అని మనసు పొరల్లో నలుపుతున్న బాధ తీసేసినట్లయింది. ఆ సంతోషంలో "మాధవిని తీసుకురాక పోయావా? అసలెందుకు వెళ్లింది. అక్కడికెలా వెళ్ళింది?" అని ఆత్రంగా అడిగింది.

ఆ రాత్రి భర్తతో చెప్పింది సుశీలమ్మ, మాధవి సంగతి.

సీతారామయ్యకు పిడుగు పడ్డట్లయింది. ఎలాగైనా కొడుకుని ఒప్పించి మంచి సంబంధం చెయ్యాలన్న ఆయన పట్టుదల నెరవేరనందుకు బాధ కలిగింది. అయినా చివరగా మరొక అస్త్రం ప్రయోగించాడు.

"మనల్ని కాదని వెళ్ళిపోయి, ఇన్నాళ్ళూ ఎక్కడెక్కడో తిరిగినదాన్ని తగుదునమ్మా అని ఈ ఇంటి కోడలిగా తీసుకురావటం మంచిది కాదు." అని.

"ఆ అమ్మాయి అలాంటిది కాదు."

"నీకేం తెలుసు?"

"అన్నం అంతా పట్టి చూడక్కర్లేదు. ఇక్కడున్నప్పుడు చూడలేదా?"

**జరిగిన కథ–3 :** కాలేజీ ఆడిటోరియంలో జరిగిన వక్తృత్వ పోటీలో మొదటి బహుమతి మోహన్, రెండవ బహుమతి స్మిత గెల్చుకొంటారు. తన కారు క్రిందపడి మరణించిన సుబ్బయ్య కూతురు మాధవిని ఆ వూరి పెద్దల ప్రోద్బలంతో పెళ్లి చేసుకుని, ఇంటికి తీసుకు వచ్చిన మోహన్‌ని సాదరంగా ఆహ్వానిస్తారు అతని తల్లిదండ్రులు సుశీలమ్మ, సీతారామయ్య. కానీ ఆ పెళ్లి వారిద్దరికీ ఇష్టంలేదు. మాధవిని మోహన్‌కి దూరంగా వుంచుతారు. మోహన్ అభిప్రాయం తెలుసుకోకుండా ఓ సంబంధం నిశ్చయం చేస్తారు సీతారామయ్య దంపతులు. అది తెల్సుకున్న మాధవి ఆ ఇంట్లోంచి వెళ్ళిపోతుంది. బస్సులో ఓ సంఘటన ద్వారా మాధవి మంచితనాన్ని గుర్తించిన విశ్వనాథంగారు ఆమెను తమ ఇంటికి తీసుకుపోతారు. వాళ్లింట్లో పనులు చేస్తూ సీతమ్మ, విశ్వనాథం దంపతులకు, వాళ్ల కూతురు భార్గవికి ఆప్తురాలవుతుంది. భార్గవికి కొడుకు పుడతాడు. విశ్వనాథం దంపతులు వేడుకలు ఘనంగా జరుపుతారు. సీతమ్మ పక్షవాతం వచ్చి మంచాన పడుతుంది. ఆమెను చూడటానికి వచ్చిన మోహన్ అక్కడ మాధవిని చూసి చాలా బాధపడతాడు. తమ గత వృత్తాంతం అంతా విశ్వనాథానికి వినిపించి మాధవిని తీసుకుపోవటానికి నిశ్చయించుకొని ఆయనను వప్పిస్తాడు.

"నువ్వు వాడితో ఏకం అయ్యావన్న మాట."

"మనకు మాత్రం ఎవరున్నారు. వాడి సుఖ సంతోషాలేగా మనకు కావలసింది?"

"మీ ఇష్టం! పుట్టిగిట్టుకు పూరేగండి. మీరే వెళ్ళి తీసుకురండి. నాకు రావటానికి కుదరదు." కోపంగా అన్నాడు సీతారామయ్య.

"మన పెద్దరికం మనం నిల్పుకోవటం మంచిది."

"నాకే నీతులు నేర్పుతున్నావా?"

"మీరేమన్నా అనుకోండి. ఎల్లుండి మంచిది. మనిద్దరం వెళ్ళి మాధవిని తీసుకువద్దాం!" నిశ్చయంగా అన్నది సుశీలమ్మ.

ఆ మాట వినటం ఇష్టంలేనట్లు మౌనంగా వెళ్ళిపోయాడు అక్కడనుంచి సీతారామయ్య.

మోహన్ మనసు పాదరసంలా పరుగెత్తుతున్నది మాధవి వైపు.

స్త్రీ పురుషుల మధ్య వుండే ఆకర్షణో, వైవాహిక బంధంవల్ల ఏర్పడ్డ అనురాగమో అర్థం కావటంలేదు. కోరుకున్నది చేతికి చిక్కినప్పుడు పొందే ఆనందమో, వయసు కోర్కెలకు ఊపిరి అందించే ప్రణయ రాగ మాధుర్యమో తెలీటంలేదు. ఏది ఏమైనా ఆ ఇంట్లో నూతనోత్సాహం వెల్లివిరిసిందనే చెప్పాలి.

మాధవి రాక కోసం క్షణమొక యుగంగా, ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఎదురు చూస్తున్నాడు మోహన్.

ప్రొద్దున ఆరు గంటలకల్లా బయలుదేరి వెళ్ళారు సీతారామయ్య, సుశీలమ్మ కార్లో. సాయంకాలం అయిదు గంటలు దాటుతున్నది. శీతాకాలం మూలాన సూర్యుడు త్వర త్వరగా, పశ్చిమాద్రిని చేరుకుంటున్నాడు. ఇంటి ముందున్న తోటలో రకరకాల చెట్లు అలసిల్లన వీచే గాలికి తలలూపుతున్నాయ్ వయ్యారంగా. పరిమళాలను వెదజల్లుతూ మాలతీ తీగ సయ్యాటలాడుతున్నది. సంధ్యాకాంత కాలి అందెలు ఘల్లుమన్నాయ్! వాకిట్లో కారు ఆగింది. ముందుగా సుశీలమ్మ దిగి లోపలికి వచ్చి, అప్పటికే సిద్ధంగా వుంచిన ఎర్రనీళ్ళ పళ్ళెం తీసుకువెళ్ళి గుమ్మంలోనుంచుని, "మాధవీ! దిగు!" అన్నది.

ఆ మాట వినగానే, అందాల మల్లెమొగ్గ అరవిచ్చుకున్నట్లు చిరునవ్వు నవ్వుతూ కుడికాలు కిందపెట్టింది మాధవి.

ఒకనాడు ఇదే కార్లో మోహన్‌తో కలిసి, ఈ గుమ్మంలో దిగింది. ఆనాడు తండ్రి పోయాడన్న బాధ, తనకు ఎలాంటి సమస్యలు ఎదురౌతయ్యోనన్న ఆందోళన, పెద్దవాళ్ళు ఆదరిస్తారో లేదోనన్న అనుమానం ... ఈనాడు, అనురాగంతో ఎదురు చూచే భర్త, ఆప్యాయంగా తీసుకువచ్చిన అత్త మామలు, కొత్త అనుభవాలకు అర్రులుచాస్తున్న శరీరం, ఇది నా ఇల్లు, నా ఇంటికి నేను వచ్చానన్న ఆత్మ సంతృప్తి. మధ్యలో జరిగిన సంఘటనలు ఆ క్షణంలో ఆమెకు గుర్తురాలేదు. జీవితరంగంలో విజయం పొందానన్న ఆత్మానందం. ఆ ఆనందంతోనే లోపలికి అడుగుపెట్టింది ఆమె.

అప్పటివరకు ఆమెను ఎన్నో అడగాలని, ఏమేమో మాట్లాడాలని అనుకున్న మోహన్, మాధవి

పెంగ్లాసు అందించగానే, చెయ్యి పట్టుకుని మీదకు లాక్కున్నాడు. తనలోవున్న కోరికల్ని, ఆవేశాన్ని, అనురాగాన్ని కలబోసి ముద్దుల్లో ముంచెత్తాడు. ఆమె తల్లో మల్లెలు పక్కున నవ్వాయి. అతనిలో చిలిపితనం చెలరేగింది. ఆమెలో సిగ్గులు మొగ్గలు తొడిగాయి. అతనిలో ఆవేశం పరవళ్ళు త్రొక్కింది. గంటలు, నిముషాలు, క్షణాలు కరిగి పోతున్నాయి. కాలం ఆగిపోతే బాగుండు. ఈ ఆనందం శాశ్వతమైతే ...? జీవితానికి అర్థం ఇదేనా? ఆనందలోకాల్ని చవిచూసే ఈ క్షణాలు ఎంత విలువైనవి? ఎంత మధురమైనవి? వాళ్ళ ఆలోచనలు ఆగిపోయాయి, వాళ్ళిద్దరి మధ్య గాలి స్తంభించింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భార్యాభర్తల అనుబంధానికి అర్థం చెబుతున్నాయి. అంతే ... ఆ తరువాత అలాంటి రాత్రింబగళ్ళు ఎన్నో, ఎన్నెన్నో ...

## 12

"హాయ్! మోహన్! ఎవరీమె?" బట్టల కొట్లోకి వచ్చిన మోహన్ను చూసి, చీరలు ప్యాక్ చేయిస్తున్న స్మిత ఆశ్చర్యంగా అడిగింది.

"షి ఈజ్ మై మిసెస్!" గర్వంగా అన్నాడు మోహన్.

"ఓ! ఆదర్శపురుషుడివేనే!" వ్యంగ్యంగా అన్నది.

"ఆదర్శం కాదు. అభిప్రాయం."

"సరేలే! కార్లో మావారు ఎదురుచూస్తున్నారు. తరువాత కలుసుకుందాం" అంటూ గబగబా వెళ్ళి పోయింది.

"ఈమె స్మిత అని నా క్లాస్‌మేట్" అన్నాడు మోహన్.

"అలాగా! ఈ చీర బాగుంది కదూ?"

"తీసుకో!"

"ఆ నూటు మీరు తీసుకోండి."

"దేవిగారి ఆజ్ఞ."

"ఏమండీ! బెజవాడ వెళ్ళి పిన్నిగార్ని చూసి రావాలని వున్నది."

"తప్పకుండాను. రేపు కార్లో వెళదాం."

వాళ్ళిద్దరివీ ఒకటే అభిప్రాయాలు. ఒకటే ఆలోచనలు. బెజవాడ వెళ్ళినప్పుడు, పోటీలు పడి దుర్గ కొండ ఎక్కేవారు. వేయించిన వేరుశనగ పప్పులు కొనుక్కుతింటు చెట్టాపట్టాలేసుకుని, కృష్ణవేణి అందాల్ని తిలకిస్తు గంటలకాలం గడిపేవారు.

అలాంటి ఆనంద సమయంలో "మాధవీ! నేను కనపడకపోతే ఏం చేసేదానివి?" చిలిపిగా అడిగేవాడు మోహన్.

"మీరు?" ఎదురు ప్రశ్న వేసేది మాధవి.

"హాయిగా సన్యాసుల్లో కలిసిపోయేవాడిని."

"ఏదీ ఈ ఒక్క రాత్రి అలా గడపండి" వుడికించేది.

"అమ్మో! ఇప్పుడు కాదు. అప్పుడు" భయంగా అనేవాడు.

"సరేగాని సంబరం, త్వరగా వెళ్దాం పదండి."

"అంత తొందరెందుకే భామామణీ" నాటక ఫక్కీలో అన్నాడు.

"అబ్బో! నాటకాలు అడ్డం కూడా వచ్చున్న మాట."

"ముదితల్ నేర్వగరాని విద్యకలదే అన్నారు గాని ..."

"మగవారికి అన్నీ వచ్చా!?"

"ఆ!"

"ఆహా! ఏదీ ఒక బుల్లిపాపాయి నివ్వండి?"

"ఓస్! అంతేగదా! పద ఇంటికి ..." మాధవి బుగ్గమీద చిటిక వేశాడు.

"అబ్బాయిగారి సరదాలు రోడ్డెక్కాయి" అంటూ కారు దగ్గరకు పరుగెత్తింది మాధవి.

కారు, డబ్బు, నౌకర్లు, మేడ ఇవన్నీ మాధవికి విసుగు కలిగిస్తున్నయ్!

పుట్టిపెరిగిన వూళ్ళో, కొబ్బరితోట మధ్యలో, చల్లని రెల్లుగడ్డి ఇంట్లో, హాయిగా కోడెదూడల మధ్య కొన్నాళ్ళు గడపాలనిపిస్తున్నది. ఆ మాటే భర్తతోనూ చెప్పింది.

"ఇదేమిటి? వున్నట్లుండి లంకంత ఇల్లు, చాకర్లు నౌకర్లు, ఈ సుఖాలన్నీ వదులుకుని అక్కడి కెళ్తానంటావు?"



"అదికాదురా! ఈ సమయంలో ఎలాంటి పయినా పుట్టింటికి వెళ్ళాలని వుంటుంది. వంట మనిషిని తీసుకునెళ్ళి కొన్నాళ్ళు వండించుకు తినిరండి" అన్నది సుశీలమ్మ.

"ఎటువంటి సమయం ?" అన్నట్లు చూశాడు మోహన్.

రెండు చేతులు ఉయ్యాలలాగా వూపుతూ "ఇదీ !" అన్నట్లు చూసింది మాధవి.

"అమ్మదొంగా" అంటూ ఎవరూ లేకపోవటంలో పెదవులు ఆమె బుగ్గకు తగిలించాడు.

"మరికొన్ని..."

"చెప్తావుండు నీ పని..." అంటూ మేడ మీదకు వెళ్ళిపోయాడు.

మర్నాడే ఇద్దరు మనుషుల్ని పంపించి, తోటలో ఇల్లు బాగుచేయించాడు. అక్కడికి కావలసినవన్నీ కారు డిక్కీలో పెట్టుకుని కారెక్కబోతుంటే ఓ నడివయసతను సైకిల్ దిగి, "ఈ కవరు మీ కివ్వమన్నారు మా అమ్మాయిగారు" అంటూ బరువైన కవరిచ్చి, వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోయాడు.

"ఎవరీ అమ్మాయిగారు ? ఏమిటీ కవరు ? ఇంత అర్జంటుగా ఎందుకు పంపించింది ?" అక్కడున్న అందరికీ వచ్చిన అనుమానాలివి. మోహన్ ఆ కవర్ని వెనక సీటుమీద పడేసి, స్టీరింగు ముందు కూర్చున్నాడు.

"నా బిడ్డ ఏ తప్పూ చెయ్యడు" అనుకున్నది సుశీలమ్మ. కారు కదిలింది.

"ఆ కవర్లో ఏముంది?" కొంటెగా అడిగాడు మాధవిని, మోహన్.

"నాకేం తెలుసు ?" నిష్ఠూరంగా అన్నది.

"అదుగో ! అప్పుడే కోపమా ?"

"..............."

"నిన్నెలా చూసుకోవాలి ?" అని ఓ డాక్టర్ని అడిగితే, "పాపాయిని ఎలా పెంచాలి" అని ఓ వ్యాసం రాసి పంపించాడు.

"నన్నేమీ పుబ్బెయ్యక్కర్లా ! ఆ వ్యాసం అమ్మాయిగారు రాసి, అబ్బాయిగారికి పంపించారు."

"అయ్యయ్యో ! దొరికిపోయాను."

"నాకు దొరక్క మీరెక్కడికి పోతారూ !"

# ఎదురు చూపు

"లేదు ! నువ్వే నాకు దొరికావు. దొరికింది చెయి జార్చుకున్నానే అని బాధపడుతున్న సమయంలో మళ్ళా నా చేతికి చిక్కావు."

అతని అనురాగానికి ఆమె వదనం వికసించిన పద్మమే అయింది. కబుర్లలో కాలం ఇట్టే గడిచిపోయి, తోట దగ్గరకు చేరుకున్నారు.

ఆ ప్రదేశం అంతా చాలా శుభ్రంగా వుంది. ఇల్లంతా అలికి ముగ్గులు పెట్టారు. వాకిట్లో కళ్ళాపుజల్లి రంగవల్లులు తీర్చారు. గోడలకు సున్నం కొట్టి, ఎర్రమన్ను పెట్టారు. మాధవీ, మోహన్ కారు దిగీదిగగానే పదిమంది పిల్లలు కారు దగ్గరకు వచ్చి "సామాను మేం తీసుకు వస్తాం మీరు పదండి" అన్నారు.

వాళ్ళిద్దరూ గుమ్మంలోకి రాగానే అప్పటికే అక్కడికి వచ్చి వున్న సుందర్రావు, ఆయన భార్య మాధవిని కుశల ప్రశ్నలడిగి "ఈ పూట మా ఇంట్లో భోంచేద్దురుగాని, వంట ప్రయత్నం చెయ్యకండి" అన్నారు.

"క్యారేజీలో సర్ది తీసుకు వచ్చాం! మీకెందుకు బాబాయ్ శ్రమ" అన్నది మాధవి.

"ఇందులో శ్రమ ఏముందమ్మా ! ఆడపిల్లకు ఒక పూట భోజనం పెట్టటం శ్రమా, ఖర్చానా ? ఆ క్యారేజి పనివాడికిచ్చి మీరిద్దరూ పెందరాళే వచ్చి భోంచెయ్యండి." అంటూ వెళ్ళిపోయారు. వాళ్ళు అలా వెళ్ళగానే మరొక నలుగురు ఆడవాళ్ళు వచ్చి మాధవిని పలకరించి వెళ్ళారు.

"అబ్బో ! అమ్మాయిగారు ఇక్కడికి వచ్చి బిజీ అయిపోయారే !" అంటూ దగ్గరకు తీసుకున్నాడు మోహన్.

"మీరు వంటరి అయిపోయినట్లు" గారాలు పోయింది మాధవి.

"జంటగా నువ్వున్నావుగా ?" కొంటెగా కన్ను గీటాడు.

"సరసాలకి సమయం వుండాలి." చిరుకోపం నటించింది.

"అవన్నీ అక్కడ వదిలేసి వచ్చింది ఇందు కోసమే !" అంటూ కౌగిట్లో బంధించాడు.

బయట వెన్నెల పిండారబోసినట్లుంది. కొబ్బరి మట్టల మధ్యనుంచి చంద్రుడు తొంగిచూస్తున్నాడు. వున్నట్లుండి వస్తున్న చల్లని గాలి మనసుకి ఆహ్లాదంగా వుంది. దూరంగా వున్న గొడ్లసావిట్లో నుంచి, "అంబా" అన్న కోడెదూడ అరుపు "అమ్మా" అని పిలిచినట్లు వినిపిస్తున్నది.

మాధవి మనసులో ఏదో మెదిలింది. కడుపులో మెల్లని కదలిక, ఆ అనుభూతికి శరీరం పులకరించింది. అంత ఆనంద సమయంలోనూ ఆమె కనుకొలకుల్లో రెండు నీటి బిందువులు నిలిచాయి. ఆమెను తదేకంగా చూస్తున్న మోహన్, "ఏమైంది" ఆత్రుతగా అడిగాడు.

"అమ్మ వుంటే ఎంత బావుండేది ?" బేలగా అన్నది.

"నిజమే ! ఆ కొరత ఎవ్వరూ తీర్చలేనిది. ఆ ఒక్క బాధా నీ మనసులోకి రానివ్వకు. మిగిలిన ఏ కోరికలైనా నేను తీరుస్తాను. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను" అతని అనురాగానికి కరిగిపోయింది ఆమె. అతని వాత్సల్యానికి పరవశించింది. ఆ భావలహరిలో తన్ను తాను మరచి అతని గుండెల్లో గువ్వలా వదిగిపోయింది.

అప్పటిదాకా ఎక్కడోవున్న మేఘం వర్షపు జల్లు కురిపించింది. ఎండి, బీటలు వారిన నేలతల్లి కమ్మని సువాసనలు వెదజల్లింది. మాధవి, మోహన్ చెట్టాపట్టాలేసుకుని, లోపలికి సరుగెత్తారు. అప్పటిదాకా వెలుగుతున్న బెడ్‌లైట్ రివ్వున వచ్చిన గాలి తాకిడికి ఆరిపోయింది.

మోహన్, మాధవిని ముద్దుల్లోముంచెత్తాడు. ఆమె అణువణువూ పులకరింపచేశాడు. అనుకోని అనుభూతులకు లోనుచేసి తృప్తితో, ఆనందంతో నిదురబోయాడు.

"ఇంత రసికుడు, కోర్కెలకు కళ్ళెం వేయలేనివాడు, భార్య సాన్నిధ్యం క్షణం కూడా వదలలేనివాడు, ఇన్నాళ్ళూ ఎలా వుండగలిగాడు ?" ఆ క్షణంలో ఆమెకు తాము రాబోతున్నప్పుడు ఎవరో ఇచ్చిన కవరు గుర్తొచ్చింది. "అందులో ఏముందో? ఎవరు రాసిందో? అమ్మాయి అంటే...ఆ అమ్మాయి మోహన్‌కి ఇది వరకే తెలుసా ? తెలిస్తే ఎలాంటి పరిచయం ?" మాధవికి ఆలోచనలతో నిద్రపట్టటం లేదు. అనుమానంతో మనసు నిలవటంలేదు. ఆవేశంతో మెదడు పని చెయ్యటంలేదు. మెల్లగా లేచి లాంతరు వెలిగించింది. ఆ లాంతరు పట్టుకుని, కారు తాళాలు తీసుకుని, అంత చీకట్లోనూ ఒంటరిగా కారు దగ్గరకు వచ్చి వెనక సీట్లోవున్న కవరు తీసుకుని మళ్ళా లాక్‌చేసి, అదురుతున్న గుండెల్తో అడుగులో అడుగు వేసుకుంటు ఇల్లు చేరింది.

మోహన్ ఎలా పడుకున్నాడో అలానేవున్నాడు. 'హమ్మయ్యా !' అనుకుని, లాంతరు ఒత్తి పెద్దది చేసి కవరు చింపింది చప్పుడు కాకుండా.

అక్షరాలు కొంచెం గజిబిజిగా వున్నాయి. కూడబలుక్కుంటు చదవటం మొదలుపెట్టింది —

"ప్రియమైన మోహన్‌కి,

ఆ రోజు బట్టలషాపులో నిన్ను, మీ శ్రీమతిని చూసిన తరువాత నాకు లేనిదేమిటో అర్థమైంది.



# ఎదురు చూపు

నాకూ లేనివి వుంటాయని ఏనాడు నేను అనుకో లేదు. డబ్బుతో అన్నీ సమకూర్చుకోవచ్చనే నా అభిప్రాయం. అదే అభిప్రాయం మా డాడీది కూడా! అందుకే తను కోటీశ్వరుడు గనుక మరొక కోటీశ్వరుడికే తన పిల్లనిచ్చాడు. నా పెళ్ళికి నువ్వెందుకనో రాలేదుగాని చాలా గొప్పగా చేశారు డాడీ! బహుశా ఈ వూళ్ళో ఇంత గొప్పగా జరిగిన పెళ్ళి నాదేనేమో! అప్పట్లో బాహ్యాడంబరాలకే నేను విలువ ఇచ్చేదాన్ని. అయితే... అయితే... ఆ రోజు... మొట్టమొదటిసారిగా 'తొలి రాత్రి' అనుభవాలకు అర్రులు చాస్తూ గదిలో ప్రవేశించాను. మావారు బాల్కనీలో నుంచుని ఎవరితోనో మాట్లాడు తున్నారు. నా రాకను గమనించి, అతడ్ని పంపించి లోపలకు వస్తారని ఎదురుచూసిన నేను, కాళ్ళు పీకుతుంటే వచ్చి మంచం ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నాను. వాళ్ళిద్దరి మాటలకు అంతంలేదు, అర్థం అసలే లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే సెక్స్‌ను గురించిన విమర్శ, అనుభవాలు, పందాలు, నాకెందుకో వెగటనిపించాయి ఆ మాటలు. విని విని కుర్చీలో జార్లబడ్డాను. "ఓ ! బ్యూటీ!" అన్న మావారి కంఠం వినిపించింది. ఆ తియ్యని మాటకు తృళ్ళిపడి లేచాను. ఆయన వెనుకే స్నేహితు డున్నాడు. "ఏమిటీ తద్దినం." మనసులోనే అనుకున్నాను. అతనక్కడ వుండగానే, నా మొహ మంతా ముద్దులతో ముంచెత్తాడు. నా నడుం పట్టుకుని లేవదీసి నుంచోపెట్టాడు. ఆపాదమస్తకం స్పృశించి ఆనందిస్తున్నాడు.

నాకు సిగ్గుతో ప్రాణం పోతున్నది. ఏమన టానికీ కొత్త ! అసలా హఠాత్ సంఘటనకి బిత్తరపోయి స్పృహకోల్పోయాను క్షణం. మరు క్షణం కళ్ళు తెరిచి, పమిట సరిచేసుకుని, గలగల అడుతున్న గ్లాసులవైపు చూశాను. సీసాలో ద్రవం మూడు గ్లాసుల్లోవంచి, అయిసు ముక్కలేస్తున్నాడు మా వారి స్నేహితుడు. "అతను ఇంకా వెళ్ళడేం?" నా సందేహం తీరకుండానే అతనోగ్లాసు తీసుకువచ్చి నాకిస్తూ, "తీసుకో మేడమ్ !" అన్నాడు.

"నేనా ?!" ఆశ్చర్యంగానూ, భయంగానూ అతని వంక చూశాను.

"ఫరవాలేదు. తీసుకో !"

అప్పటికే మా వారు బాగా తాగినట్లున్నారు. కళ్ళు కొంచెం ఎర్రబడ్డాయి. మాటతడబడుతున్నది.

"ఈ గదిలోకి ఇవన్నీ ఎలా వచ్చాయి ?"

"ప్లీజ్ ! తీసుకో మేడమ్ !" బ్రతిమాలు తున్నట్లు అన్నాడు.

"నువ్వెవరు నన్ను బ్రతిమలాడటానికి? ఏక వచన సంబోధన చెయ్యటానికి" చాచి చెంపమీద కొట్టాలనిపించింది.

"మందు పడితేగాని నాకు కిక్‌రాదు. ఆ మత్తులో మజా అంటే ..."

"డియర్ ! నువ్వెప్పుడూ తాగలేదా ? అందుకే ఇంతాలస్యం చేస్తున్నావు" అంటూ శ్రీధర్ (మా వారు) నా దగ్గరకు వచ్చి స్నేహితుడి చేతిలో గ్లాసందుకుంటు, "మా ఇద్దరికీ ఇచ్చావు. నువ్వా త్వరగా తీసుకొనిరా ?" అన్నాడు.

ఆ గదిలో అతనెందుకున్నాడో, ఈ తాగుడేమిటో, నాకు అర్థం కాలా ? ఆ మాటే శ్రీధర్ని అడిగాను.

"ఆనందాన్ని నలుగుర్తో పంచుకోవటం నాకు అలవాటు."

"అంటే ? ..."

"అంటే ఏంలేదు. ఈ రాత్రి నాతోబాటు అతనూ ఉంటాడు. త్వరగాతాగేసెయ్! మళ్ళా అతను తెల్లవారుఝామున ట్రైనుకి వెళ్ళిపోవాలి" అంటూ నా తల వెనక్కు వంచి, ఆ మందు నా గొంతులో పోశారు. అలవాటులేని ఆ పనికి, నాకు వాంతులు మొదలయ్యాయి. నాలుగు మూడు వాంతులయ్యాక, సొమ్మసిల్లి మంచంమీద వాలిపోయాను. ఆ తరువాత ... వాళ్ళిద్దరూ ... అలా గడిచింది నా మొదటి రాత్రి.

నాలుగు రోజుల తరువాత మత్తుగా వున్నా కళ్ళు పెకలించుకుని చూశాను. ఆత్రంగా నా వైపే చూస్తోంది అమ్మ. నాన్నగారి చూపుల్లో జాలి కనిపించింది నాకు. అప్పుడే లోపలకు వస్తున్న శ్రీధర్ "అమ్మయ్య! ఎంత కంగారుపడ్డానో తెలుసా ! ? ఇవిగో ఈ పళ్ళు, హార్లిక్స్, మందులు అన్నీ నీ కోసమే! డాక్టర్ చెబుతూనే ఉన్నాడు ఈ రోజు తెలివి వస్తుందని. బలానికి మంచి ఆహారం తీసుకోవాలి. ఊ! క్విక్," హుషారుగా అన్నాడు. అతని మాటలు ఆకలిగొన్న పులి గాండ్రింపులా వినిపించింది నాకు. అతని మాటల్లో ఆప్యాయతకన్నా అధికారం ధ్వనించింది. ఏ క్షణంలో పెద్దవాళ్ళు తప్పుకుంటే ఆ క్షణంలో అనుభవిద్దా మన్న ఆత్రుత గోచరించింది. సిగ్గుతో తల వంచు కున్నాను. వెంటనే గోడవైపు తిరిగి కళ్ళు మూసు కున్నాను. శ్రీధర్ నామీదుగా వంగి నా మొహంలో మొహం పెట్టి, "ఇప్పుడే వస్తాను డియర్ ! నా కోసం ఫ్రెండ్స్ వెయిట్ చేస్తున్నారు." అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

"మధురమైన అనుభవాల్ని, జీవితాంతం పదిలపర్చుకోవలసిన అమూల్యమైన నా ఆనందాన్ని నీ మొరటుతనంతో, అనాగరికమైన ఆవేశంతో నాశనం చేశావు శ్రీధర్ !" అని బాధగా మూలిగింది మనసు.

ఆ తరువాత అతని ప్రవర్తన కృత్రిమంగానే వుండేది. ఒక్కొక్కసారి నామీద ఈగ వాలితేనే కందిపోతానన్నట్లు, కాఫీ కప్పు పట్టుకొస్తేనే నా చేతులు నొప్పిపుడతాయన్నట్లు, నీ కోసమే నేను బ్రతుకుతున్నానన్నట్లు ప్రవర్తించేవాడు. మరొకసారి తన స్వేచ్ఛకు నేను అడ్డంగా వున్నానని— పెళ్ళి, పెళ్ళాము, కట్టుబాట్లు బూజుపట్టిన ఆచారాలని, నా మూలంగానే తన సుఖాలన్నీ నాశన మయ్యాయని, మేడమీద గదిలోకి తీసుకువెళ్ళి, ఒళ్ళంతా సిగరెట్ పీకలతో పుళ్ళు చేసేవాడు. అన్నింటికంటే నేను సహించలేనిది తన స్నేహితులకు నన్ను అప్పగించటం. ఏ మగవాడైనా ఇలా చేస్తాడా? పవిత్రమైన భార్యాభర్తల అనుబంధాన్ని అవమానం చెయ్యటంగాదా ? తనకి ఎంతోమంది స్త్రీలతో పరిచయం వుంది. తన స్వార్థం కోసం నన్నూ ఎంతోమందికి లొంగిపొమ్మంటాడు. విపరీతంగా తాగుడు. చేతిలో బి.ఇ. డిగ్రీ వున్నా, ఉద్యోగం చెయ్యడట. 'కష్టపడాల్సిన ఖర్మ నాకేమిటి ?' అంటాడు. బిడ్డలు అసలేవద్దుట. తల్లినవుదామన్న కోరిక నేను చంపుకున్నాను సరే! మనవడి కోసం ఎదురు చూసే అమ్మా, నాన్నలను చూస్తుంటే జాలి, బాధ కలుగుతాయి. "మీరు కలలుగనే ఆ ఆనందం నేనివ్వలేనమ్మా !" అని చెప్పాలనిపిస్తుంది ఒక్కొక్కసారి. అయితే ... శ్రీధర్ ఇన్ని చేస్తున్నా వాళ్ళకు తెలీదు. వాళ్ళదగ్గర కపట ప్రేమ ఎంత ఒలకబోస్తాడో! ఇటువంటి సంగతి తెలిసే కాబోలు వాళ్ళ తల్లిదండ్రులు ఒక్క పైసా ఇవ్వరు. ఇక్కడ నాన్నగారు అడక్కుండానే డబ్బిస్తారు, కావలసిన దానికంటే ఎక్కువగా. ఆ డబ్బే మా ఇద్దరి మధ్య అనురాగాన్ని హరించి అతనికి క్రొత్త దోవలు చూపిస్తున్నది. ఒకటి రెండుసార్లు, "అంతంత డబ్బు ఇవ్వకండి నాన్నా" అంటే "పోనీలే అమ్మా !



బేబీ మృదుల కూచిపూడి భరతనాట్యాలలో 9 సం॥ల చిన్నారి వయస్సులోనే యెంతో ప్రావీణ్యం సంపాదించి, అనేక ముఖ్య సమావేశాలలో పెద్దల సమక్షంలో తన బృందంతో కూచిపూడి భరతనాట్య ప్రదర్శనలు యిస్తున్నది. ఇటీవల విజయవాడ రోటరీ క్లబ్ ఆడిటోరియంలో సాంస్కృతిక సమితి ఏర్పాటున బేబీ మృదుల బృందం చేసిన నృత్యాలు ప్రేక్షకులను ముగ్ధులను చేశాయి. "మీరా" నృత్యం, 'లంబాడీ' నృత్యం లాంటి నూతన పోకడలు గల నృత్యాలను అవలీలగా 5వ తరగతి చదువుకుంటున్న యీ 'బాల' ప్రదర్శించింది.

[ఒ. వి.]

మీరిద్దరూ జల్సాగా ఖర్చుపెట్టుకోండి. నీ కోసమేగా శ్రీధర్ తీసుకుంటున్నది'' అనేవారు.

"నీ వయసులో వున్నప్పుడు నాకు ఏ సరదాలు తీరలేదు. మీ నాన్నగారు, నేను కలిసి సినిమాకు వెళ్దామన్నా సరిపడ డబ్బులుండేవికావు. నువ్వైనా అనుభవించు'' అనేది అమ్మ.

ఇదంతా నా సుఖం కోసమేనని, నేను ఎన్నో సౌఖ్యాలు పొందుతున్నానని, అల్లుడు చాలా సరదా అయిన మనిషనీ, నేనంటేనే కాకుండా తామన్నా ఎంతో అభిమానమనీ పొంగిపోతున్న వాళ్ళిద్దరి అమాయకత్వం చూస్తే జాలివేసేది. వాళ్ళను ఆ ఊహాజగత్తులోనుంచి బయటకు తీసుకువచ్చి చేదునిజాలను వినిపించాలంటే నాకు ఏదో భయం. అందుకనే వీలయినంతవరకు నా సంగతులు అమ్మా, నాన్నలకు కూడా తెలియనివ్వను. ఇదంతా నీకెందుకు తెలియజేస్తున్నానంటే ఒకనాడు డబ్బున్నవాళ్ళు, డబ్బున్నవాళ్ళనే పెళ్ళి చేసుకుంటే సుఖపడతారన్న అహంకారంతో నీతో వాదించేను. జీవితానికి డబ్బే ముఖ్యం కాదని, చదువు, సంస్కారం, సహృదయత మనిషి సుఖశాంతులకు దోహదం చేస్తాయని ఇప్పుడు తెలుసుకున్నాను. ఏమైనా నువ్వు అదృష్టవంతుడివి. అనుకూలవతి అయిన భార్య, ఆదర్శవంతమైన దాంపత్యం, ఏమైనా చెప్పింది చేసే నీ మనస్సు చాలా గొప్పది. నీ జీవితంలో భాగం పంచుకున్న నీ శ్రీమతి చాలా అదృష్టవంతురాలు.

నా ఆలోచనే సరైనదనీ, నా ఊహలే గొప్పవనీ భ్రమించిన నాకు భగవంతుడు మంచి శాస్తే చేశాడు. నా దురదృష్టానికి కృంగిపోతున్నా నీ అదృష్టానికి పొంగిపోతూ నీ చెల్లి స్మిత.''

ఆ ఉత్తరం చదివి గాఢంగా నిట్టూర్చింది మాధవి. "ఆ రోజు బట్టలకొట్లోనుంచి, చేతినిండా ప్యాకెట్లు తీసుకుని హుషారుగా వస్తూ, తనని పలకరించిన అందాలబొమ్మ స్మిత ఎంతటి అగ్ని పర్వతాల్ని గుండెల్లో దాచుకున్నది ? ఆమె అన్నట్లు ఈ దేశ సంస్కృతి, నాగరికత ఎటువైపు పయనిస్తున్నది. నైతిక విలువలు ఇంతగా దిగజారటానికి కారణం ఏమిటి ? పవిత్రమైన వివాహ బంధానికి విలువ ఇదేనా ?'' మాధవి మనస్సు ఆలోచనాతరంగమైంది.

విసురుగా వచ్చిన గాలి తాకిడికి వెలుగుతున్న దీపం ఆరిపోయింది. అప్పుడే చీకటిని చీల్చుకుంటు వెలుగు రేఖలు భూమిమీద ప్రసరిస్తున్నాయ్ !

"మధూ !'' అంటూ మత్తుగా అటునుంచి ఇటు కదిలాడు మోహన్.

కూర్చున్నచోటు నుంచి లేవబోయిన మాధవి కడుపులో బిడ్డ కదిలాడు.

"ఈనాటి అస్తవ్యస్తపరిస్థితి మీ తరాల్లోనన్నా చక్కబడాలి. స్త్రీని గౌరవించే మంచిరోజులు, ఆమె కూడా మనస్సున్న మనిషేనని గుర్తించే శుభ ఘడియల కోసం 'ఎదురు చూపు' చూస్తున్నాం'' అనుకున్నదిపుట్టబోయే బిడ్డను తల్చుకుని.

**(అయిపోయింది)**



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు— రచన పేరు — అది పంపిన తేదీ, వివరంగా వ్రాయందే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పడ్డ "ప్రతు''లను— కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుండందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.



# నిలువు దోపిడి

— విశ్వభరత్

"వెంకటస్వామీ! చెప్పినదంతా అర్థమయింది కదూ ?"

భయంగా, బెదురుగా దామోదరం వైపు చూశాడు వెంకటస్వామి. "సార్! ఈ పని... పాపం, సార్! దైవ దర్శనం కోసం వెళ్ళే వారిని దోచుకోవటం ... "

"షటప్!" చిన్నగా కసిరాడు దామోదరం. "జాగ్రత్త! నీ భార్యాబిడ్డలు ... నా గుప్పిట్లో వున్నారు. వాళ్ళెక్కడున్నారో ఆచూకీ కూడా నీకు తెలియదు. నేను చెప్పినట్లు చేస్తేనే వాళ్ళని తిరిగి చూడగలుగుతావు, లేకపోతే ... "

"... వద్దు సార్! మీరు చెప్పినట్లే చేస్తాను" అన్నాడు వెంకటస్వామి మనసులోనే లెంపలు వేసుకుంటూ.

"గుడ్! యిక వెళ్ళి, బస్ స్టార్ట్ చెయ్!" అన్నాడు దామోదరం సిగరెట్ తీసి వెలిగించుకుంటూ.

మాట్లాడకుండా స్టీరింగ్ ముందు కూర్చుని, ఎదురుగావున్న అలమేలు మంగా – వెంకటేశ్వరుల ఫొటోలకు భక్తిగా నమస్కారం చేసి, ఇగ్నీషన్ కీ తిప్పాడు. బర బరమంటూ ఇంజన్ స్టార్ట్ అయింది.

ఎదురుగా ఒక ముత్తయిదువ వచ్చేవరకు ఆగి, బస్‌ని ముందుకు దూకించాడు వెంకటస్వామి. బస్‌లోవున్న వారందరు కబుర్లలో పడ్డారు. కొందరు దిన పత్రికలు, వార పత్రికలు తీశారు. పిల్లలు కిటికీలలో నుంచీ బయటకు చూస్తున్నారు. పెడన దాటగానే స్పీడ్ పెంచాడు వెంకటస్వామి. పెరిగిన గడ్డం తడుముకున్నాడు. వ్యూ మిర్రర్‌లో నుంచీ వళ్ళంతా బంగారపు ముద్దలాగా వున్న భాగ్యలక్ష్మి కనిపిస్తోంది.

ఆవిడ గురించే బస్ ద్వారకా తిరుమలకు టూరిస్ట్‌గా బయల్దేరింది. భాగ్యలక్ష్మి భర్త బసవలింగం బిజినెస్‌లో బాగా సంపాదించాడు. పలుకుబడీ, పరిచయాలు ఎక్కువ.

బసవలింగం ఒకసారి తీవ్రంగా జబ్బు పడ్డాడు. డాక్టర్లు తెల్లవారితేగాని చెప్పలేం అన్నారు. దాంతో కంగారు పడిపోయిన భాగ్యలక్ష్మి వెంటనే తన భర్తకి నయమైతే వెంకటేశ్వరునికి 'నిలువు దోపిడి' యిస్తానని మొక్కుకుంది. బసవలింగం ఆరోగ్యం పుంజుకున్నాడు.

ఆ తరువాత ఒక మందు విందులో తన మిత్రులతో భార్య మొక్కు సంగతి చెప్పాడు.

"అదేమిటోయ్! సాధారణంగా ఎవరైనా తిరుపతి అంటే పెద్ద తిరుపతికి వెడతారు. కాని ఈ ద్వారకా తిరుమల ఏమిటి?" అన్నారు ఒకరిద్దరు.

"ఆవిడగారి పుట్టిల్లు ఏలూరుకు దగ్గర్లోనే వున్న భీమడోలు. అందువల్ల ఆవిడ భక్తి అంతా ద్వారకా తిరుమలవాసుడే! మొక్కుకుంది కనుక వెళ్ళాల్సిందే" అన్నాడు బసవలింగం నవ్వుతూ.

"అయితే మేమూ వస్తాం, ఏకంగా ఒక టూరిస్ట్ వేసేస్తే సరి" అన్నారొకరు.

# ప్రకృతి కానుక ప్రతి ఒక్కరికి.
# కోమల,యవ్వన ఛాయ సర్వాంగాలకి



పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా. వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు. అందుకనే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ.

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది. శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా నుంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది.

ప్రకృతికి తరలండి. మార్గోతో స్నానం చెయ్యండి. మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా, తాజాగా, మెరుస్తూ వుంటుంది.

## శరీరమంతా పరిశుభ్రం
## తల్లిలా చేసే సంరక్షణ




కాల్‌కెమికో వారి ఒక ఉత్పాదన నాణ్యతకే పూచీ వాడేవారికి

HTC-CCC 4000

# నిలువు దోపిడి

"ఔను. మేమూ ఆ ద్వారకా తిరుమల చూడలేదు యింతవరకు" అన్నారు మిగిలిన వారందరూ.

అలా ప్రోగ్రాం సెటిలయింది. బసవ లింగంతోబాటు అందరూ 'ల' కారులే. దాదాపు పది కుటుంబాలు! మంచి టూరిస్ట్ బస్‌లు సప్లయ్ చేసే స్టార్ కంపెనీకి కబురు వెళ్ళింది. ఆ తరువాత ఏర్పాట్లన్నీ అయి పోయాయి.

దామోదరానికి అప్పుడే దురాలోచన ఏర్పడింది. బస్‌లో వచ్చే వాళ్ళందరూ సంపన్నులు! పైగా యిటువంటప్పుడు ఆడవాళ్ళు ఒకరిపై ఒకరు పోటీకోసం వున్న నగలన్నీ అలంకరించుకుంటారు!

స్టార్ టూరిస్ట్ బస్‌లంటే జాగ్రత్తగా తీసుకువెళతాయని, బస్‌లు కండిషన్‌లో వుంటాయని ఒక నమ్మకం వుంది ప్రజలలో. అదే యిప్పుడు అవకాశంగా ఉపయోగించుకో దలిచాడు దామోదరం. అతను స్టార్ కంపెనీలో మేనేజర్.

బస్‌లో అందరిదగ్గరా వుండే నగలు, వాచీలు, డబ్బు – ఎంతలేదన్నా లక్షపైన వుంటాయి... చాలు!

ద్వారకా తిరుమల రూట్‌లో భీమడోలు దాటాక కొంత దూరం వెళ్ళాక రోడ్డుకి అటూ యిటూ చెట్లతో అరణ్యంలా వుంటుంది. అక్కడకు వచ్చేసరికి తను బస్ ఫ్లో చేయాలి! ఏదో ఒక స్పాట్‌లో ఆరుగురు వాటు పిస్తోళ్ళతో రెడీగా వుంటారు. బస్ ఆపేసి, అందర్నీ నిలువు దోపిడీ చేసేస్తారు!

అదీ దామోదరం ప్లాన్!

నిన్న తను ఏదో పెళ్ళికి గుంటూరు వెళ్ళివచ్చాడు. వచ్చీరాగానే దామోదరం తనని యింటికి వెళ్ళకుండా ద్వారకా తిరుమల వెళ్ళమన్నాడు. మామూలుగా యిచ్చే బేటా కాకుండా ఐదు వందలు ఎక్కువ తనే యిస్తా నన్నాడు. తను వప్పుకున్నాక అసలు విషయం బయటపెట్టాడు.

నిలువుదోపిడి అని తెలిశాక తను ఆ పని చేయలేనన్నాడు. కాని తన భార్యాబిడ్డలు వాడి ఆధీనంలో వున్నారుట! తప్పదు! ఆ దుర్మార్గుడితో ఈ పాపంలో పాలు పంచుకో వాల్సిందే!

ఎలాగో అలా ఏలూరులో ఒక గంట ఆలస్యం చేయమని దామోదరం చెప్పాడు. ఆ వ్యవధిలో ఒక పాత నల్ల ఫోర్డ్ కారులో ఆరుగురు దామోదరంతోబాటు నిర్ణయించు కున్న స్పాట్‌కి చేరుకుంటారు.

రాత్రి పదకొండు గంటలు కావస్తుండగా ఏలూరు చేరింది బస్. ఒక ఇరానీ హోటల్ ముందు బస్ ఆపాడు వెంకటస్వామి.

"సార్! అందరూ టీ త్రాగండి! ఎవరు నిద్రపోయినా నాకూ నిద్ర వస్తుంది. డ్రైవింగ్‌లో తూలు వచ్చిందంటే..." అని ఆగిపోయాడు.

"సరే! నువ్వే వెళ్ళి, కాస్త ఆలస్యమయినా అందరికీ బస్‌లోకే టీ పంపించమను. నువ్వూ తాగి, రా!" అన్నాడు బసవలింగం.

వెంకటస్వామి బస్ దిగి, ఇరానీ హోటల్లోకి వెళ్ళిపోయాడు. బస్‌లో వారి సంభాషణ అతనికి వినిపిస్తూనేవుంది.

"ఇక్కడినుంచీ గంటలో వెళ్ళగలమా?" అడిగారెవరో.

"ఆఁ! మంచి స్పీడ్ వెడితే చేరుకోవచ్చు. కాని వెంకటస్వామి ఎక్కువ స్పీడ్ వెళ్ళడు. జాగ్రత్త ఎక్కువ!" అన్నాడు బసవలింగం.

"అదీ నిజమే! ఓవర్ స్పీడ్ వెళ్ళి యాక్సిడెంట్ చేస్తే ఏం చేయగలం?" అన్నారెవరో.

"వెళ్ళిమాత్రం చేసేది ఏముంది? తెల్లవారేవరకు కాటేజ్‌లో నిద్రపోవటమే గదా?" అన్నారు మరొకరు.

ఆ తరువాత సంభాషణ యాక్సిడెంట్లు, డ్రైవర్‌లు – అలా సాగిపోయింది! అందరికీ అంచెలు అంచెలుగా టీ అందజేశాడు వెంకట స్వామి. అరగంట తరువాత బస్ స్టార్ట్ చేసేసరికి ఈదురుగాలి ఆరంభమయింది. క్షణాలమీద ఉధృతమయి, వర్షం ఆరంభ మయింది. కిటికీ అద్దాలు ఎత్తి కూర్చున్నారు.

"వర్షం తగ్గాక పోదాం...ఇంత వర్షంలో డ్రైవింగ్ చేయటం మంచిదికాదు. అసలే రూటు బాగుండదు..." అన్నాడు వెంకటస్వామి.

ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. దాదాపు అరగంట తరువాత వర్షం, గాలి తగ్గి పోయాయి. బస్ కదిలి వేగం అందుకుంది.

భీమడోలు దాటగానే వెంకటస్వామి గుండె దడదడలాడటం మొదలయింది.

ఈపాటికి ఆ దుర్మార్గులు అక్కడికి చేరుకునే వుంటారు. మరో పావు గంటలో కిరాతకం జరిగిపోతుంది!

"స్వామీ! ఈ విధంగానైనా నీ దర్శనం చేసుకుంటున్నానని, మొక్కు తీర్చుకుంటు న్నానని సంతోషించాను. కాని ఇలాంటి నిలువు దోపిడీ వ్యవహారంలో చిక్కుకు పోతాననుకోలేదు..." అని మనసులోనే బాధపడుతూ, అక్కడక్కడా రోడ్డుకి అడ్డంగా





K.బాలచందర్
ప్రేమాలయా వారి
47 రోజులు
కలర్
నిర్మాత: ఆర్.వెంకట్రామన్ సంగీతం ఎం.ఎస్.విశ్వనాథన్
మాటలు గణేష్‌పాత్రో పాటలు: ఆచార్య ఆత్రేయ ఫొటోగ్రఫీ బి.ఎస్.లోకనాథ్
శ్రీ తారకరామ - నవయుగ పిక్చర్స్
SAI KRISHNA ADS
సాయికృష్ణ

# సి ని మా

## నాయుడుగారబ్బాయి

"ఆగస్ట్ 1 నుంచి 15 వరకు అన్నవరం, రాజమండ్రి, గోదావరి పరిసర ప్రాంతాలలో కృష్ణ, అంబికలమీద నాలుగు పాటలు పిక్చరైజ్ చేశాం. కొన్ని సన్నివేశాలలో కవిత, మిక్కిలినేని పాల్గొన్నారు," అన్నారు డైరెక్టర్ బి. వి. ప్రసాద్. దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు సమకూర్చిన రాజీవి ఫిలిమ్స్ "నాయుడుగారబ్బాయి" చివరి షెడ్యూల్ పూర్తయింది. చక్రవర్తి సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పంలో ఎస్. రామలింగేశ్వరరావు, బి. వి. పి. ఎ. గోపీనాథ్ నిర్మాతలు.

## "బాబులుగాడి దెబ్బ"

"జూలై 31 వరకు జరిగిన షెడ్యూల్‌తో చిత్రం సగానికి పైగా పూర్తయింది," అన్నారు వడ్డే రమేష్. ఈయన నిర్వహణలో వడ్డే శోభనాద్రి నిర్మాతగా వడ్డే కిశోర్ సమర్పించే విజయమాధవీ పిక్చర్స్‌వారి చిత్రానికి పై పేరు పెట్టినట్లు డైరెక్టర్ కె. వాసు చెప్పారు. కృష్ణంరాజు, శ్రీదేవి, రాధిక, సత్యనారాయణ, రావు గోపాలరావు, గిరిబాబు, త్యాగరాజు, జ్యోతిలక్ష్మి వగైరా తారాగణం. గోపి సంభాషణలు, వేటూరి గీతాలురాశారు. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు. కన్నప్ప ఛాయాగ్రాహకుడు. జి. జి. కృష్ణారావుసంకలనకర్త.

---



'రామాపురంలో సీత'లో మదాత

# సినిమా

## రాజాచంద్ర దర్శకత్వంలో కొత్త చిత్రాలు

మురళీమోహన్, సరిత నాయకా నాయికలుగా ఆర్. శేషగిరిరావు నిర్మించే బాలమురళీ ప్రొడక్షన్స్ చిత్రం షూటింగ్ సెప్టెంబర్‌లో ప్రారంభమవుతుంది.

మురళీ చిత్ర పతాకంలో హీరో మురళీమోహన్ నిర్మించే చిత్రం డిసెంబర్‌లో సెట్స్‌కు వెళ్తుంది.

## మాయదారి అల్లుడు

"చివరి షెడ్యూల్ ఆగస్ట్ 12 నుంచి 23 వరకు జరుగుతుంది," అన్నారు డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్. బాబూరావు నిర్మించే జి. వి. కె. ప్రొడక్షన్స్ "మాయదారి అల్లుడు" చిత్రంలో కృష్ణ, జయప్రద, శ్రీధర్, సత్యనారాయణ, జగ్గయ్య, గిరిబాబు, అల్లు రామలింగయ్య, రాజ్‌బాబు, హేమసుందర్, జయభాస్కర్, హరిబాబు, జగ్గారావు, ఆనందమోహన్, గీత, ఎస్. వరలక్ష్మి, పుష్పకుమారి, ఝాన్సీ పాత్రధారులు. ఎం. డి. సుందర్ కథకుడు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. జె. వి. రాఘవులు సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయ, త్రిపురనేని వరప్రసాద్ సహ దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

## శోభన్, కట్టా కాంబినేషన్‌లో తమ్మారెడ్డి చిత్రం

"సెప్టెంబర్ 11న షూటింగ్ ప్రారంభం," అన్నారు తమ్మారెడ్డి కృష్ణమూర్తి. ఈయన సమర్పించే రవీంద్ర ఆర్ట్ క్రియేషన్స్ చిత్రంలో శోభన్‌బాబు, శ్రీదేవి, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, నూతన్‌ప్రసాద్, కవిత, పుష్పలత పాత్రధారులు. తోటకూర ఆశాలత, తమ్మారెడ్డి కృష్ణమూర్తి సమకూర్చిన కథకు సత్యానంద్ సంభాషణలకర్త. చక్రవర్తి సంగీతం, వినాయకం ఛాయ, ఆదుర్తి హరనాథ్ కూర్పులో కె. వి. నారాయణరెడ్డి నిర్మాత. కట్టా సుబ్బారావు దర్శకుడు. ★





గంగాధర
చరితచిత్ర కంబైన్స్
కురుక్షేత్రం
SREEPUBS
లక్ష్మీచిత్ర శ్రీలక్ష్మీచిత్ర
నిర్మాత: తమ్మారెడ్డి వి.కె., * దర్శకత్వం: లెనిన్
స్కోప్·కలర్
సీడెడ్: నవయుగ పిక్చర్స్

సీరియల్

# రాగజ్వాల



చిట్టూరెడ్డి సూర్యకుమారి

## (గత సంచిక తరువాయి)

సూర్యుడు ఇంకిపోయాడు. అయినా అతను వదలిపోయిన వెలుతురు ఇంకా వుంది.

డాక్టర్ మల్లిక స్టెత్ విసుగ్గా బల్లమీద వేస్తూ "సారీ వసుంధర! నిన్ను చాలాసేపు వుంచేశాను. ఏదో చిన్న కేసు త్వరగా వచ్చేద్దామనుకున్నా. పేషంటుకంటె పేషంటు తాలూకు మనిషి ఒకటే గొడవ. వరల్డ్ ఎండ్ అయినంతగ గొడవ చేస్తున్నాడు. కొంతమంది అంత సిల్లీగా ఎందుకు చేస్తారో అర్థమే కాదు. ఆమె ఇతని ప్రేమకు తట్టుకోలేకనే మూర్ఛపోయి వుంటుంది. ఏదో షాక్ తగిలి ఫెయింట్ అయింది.

'డాక్టర్ డాక్టర్! నా రమ్యను కాపాడండి. ఎంత డబ్బు అయినా సరే' అంటూ పిచ్చిగా బిహేవ్ చేస్తున్నాడు. సైకోలాగుంది... అబ్బా..."

డాక్టర్ మల్లిక చెప్పతూ వసుంధర వైపు చూసింది. "మల్లికా ఆ పేషంట్ ఎక్కడ వుంది? అతను ఎక్కడ వున్నాడు? ఆమెకు స్పృహ వచ్చిందా, వెళ్లిపోయారా?" అని ఆత్రంగ గుక్క తిప్పకోకుండ అడుగుతుంటే –

"ఏమిటే... నీ ఆత్రం... కూర్చో."

"మల్లికా, చెప్పవే ప్లీజ్..." అంటూ ముందుకు నడిచింది.

"ఇంకా కాషుయాలిటీలోనే వున్నారు - ఇంత స్మెల్లింగ్ సాల్ట్ ఇచ్చి వచ్చాను..." అంటూ నవ్వింది వసుంధర పరుగెత్తింది.

అక్కడ బల్లపై పడుకునివున్న రమ్యను పిలుస్తూవున్నాడు శ్రీకాంత్...

అక్కడ నిలుచున్న నర్సులు – డాక్టర్‌లు నవ్వుకుంటున్నారు – సైగ చేసుకుంటూ.

వసుంధరను ముందు గుర్తుపట్టలేదు శ్రీకాంత్ "డాక్టర్ డాక్టర్ మీరు పరీక్షించండి." వేడుకుంటున్నట్లుగా చేతులు జోడించాడు.

"శ్రీకాంత్... భయపడకు" తనను తాను సంభాళించుకుంటూ, శ్రీకాంత్ భుజం తట్టింది.

"వసుంధరా!" నదిలో మునిగిపోతున్నవాడికి దుంగ దొరికినట్లు వసుంధర చేతులు పట్టుకున్నాడు. వసుంధర క్షణం కూడ వృథా చేయలేదు. పల్సు చూసింది. కనురెప్పలు ఎత్తి కనుగుడ్లు పరీక్షించింది. నర్సును తొందరపెట్టి గబగబ ఇంజక్షన్స్ ఏవో చేసింది – ఆక్సిజన్ పెట్టింది. ఇంట్రావీనస్ ఇంజక్షన్లు – సెలైన్ ఎక్కించింది – ఎంతో కష్టపడిన తరువాత, రమ్య పల్స్ – బి. పి. నార్మల్‌కు అందుకున్నాయి. ఆ తరువాత మెల్లగా స్పెషల్ వార్డులోకి మార్పించింది. రమ్యకి తెలివి రాకపోయినా కండిషన్ బాగానే వుంది. తెలివి మెల్ల మెల్లగా రావడమే మంచిదని చెప్పి -- ధైర్యం చెప్పింది వసుంధర.

"వసుంధరా! తల్లీ! నీకింకా, ఇంకా ఋణపడి వున్నాను. నా రమ్యను నాకు దక్కించావు..." గద్గదస్వరంతో పలికాడు.

వారు కలుసుకున్న విధం విని ఆశ్చర్యపోయింది.

"నిన్ను చూసిన సంతోషం – వుద్వేగం -- బలహీనంగ వున్నా ఆమె తట్టుకోలేకపోయింది. అంతే" అంటూ శ్రీకాంత్‌కు కూడా ఓ ఇంజక్షన్ ఇచ్చింది. రమ్య కాళ్లపై చేయి వేసి, ప్రక్కన కూర్చునే బెడ్‌పై తల వాల్చి పడుకున్నాడు. ఎగిరెగిరిపడే అతని నరాలు – సర్దుకుని – నెమ్మదించాయి -- మెల్లగా కళ్లు మూసుకున్నాడు.

* * *

కృష్ణపక్ష చంద్రుడు – కాలాన్ని భారంగా గడుపుతున్న వృద్ధుడిలా మెల్లగా పశ్చిమ దిక్కుకు పోతున్నాడు. రాత్రి చివరి దశకు వచ్చింది. చల్లని వేళ ప్రకృతి ఇంకా మత్తుగా సేదతీరుతోంది – ఎక్కడో నాలుగు గంటలు కొట్టారు. రమ్యకు మెలకువ వచ్చింది. ఆశ్రమంలో చేరినప్పటినుండి ఆ వేళకి మెలుకువ వస్తుంది. మేలుకొంటున్న ప్రకృతిని చూసి కలలు కంటూ – జ్ఞాపకాలు బాధిస్తున్నప్పుడు దుఃఖిస్తూ తనకు మిగిలిన మధుర స్మృతులే పదే పదే తలుచుకుంటూ, ఓ గంట పడకమీదనే వుండడం అలవాటు అయ్యింది. మేలుకున్న రమ్య తాను ఆశ్రమంలోనే వున్నాననుకుంది. తరువాత పరిసరాలు గుర్తించి తనెక్కడ వున్నాను అనుకుంది. టేబుల్ దగ్గర కుర్చీలో వెనక్కి వాలి – నిద్రలోకి జారిపోయిన 'వసుంధర'ను చూసింది. ఆమెను గుర్తించటానికి కాసేపు పట్టింది. కదలికలో కాళ్ళకు తగిలిన శ్రీకాంత్‌ను చూసింది. మెల్లమెల్లగా అంతా గుర్తుకు రాసాగింది. అతని చేతుల్లో వాలిపోవటంవరకే తెలుసు – ఆ తరువాత జరిగినది వూహించుకుంది.

తను వసుంధర దగ్గరకు తెచ్చివుంటాడు. మళ్లీ ఆ వసుంధర తనకు ట్రీట్‌మెంట్ ఇచ్చి వుంటుంది. వసుంధర వైపు చూసింది. వసుంధర ఎలాటిదైనా, మంచి డాక్టరు. తను వూహించింది కరెక్టు. ఎట్టి పరిస్థితుల్లోను తన ధర్మాన్ని మరువదు. అందుకు ఆమెను తనెప్పుడూ అభిమానిస్తుంది – వెనక్కి వాలి పడుకోవటంలో పైటలో నుంచి తాళిబొట్టు కనుపించాయి. కొద్దిగ వళ్ళు చేసింది. అంతకుమించి ఆమెలో ఏ మార్పు లేదు. కడుపు ఎత్తుగ వుంది. గర్భిణి స్త్రీలా నిండుగా వుంది. సహజమైన ఈర్ష్యతో మనస్సు కలుక్కుమంది. తనను ప్రేమించినట్లే వసుంధరను ప్రేమించివుంటాడా శ్రీకాంత్! అయినా తనను మరచిపోలేదు. ఆర్తిగా తనను చూసి చేతులు చాచాడు. తిరిగి శ్రీకాంత్‌ను చూసింది – చెంపలు పలుచగా కనిపిస్తున్నాయి – చెరిగిన క్రాఫ్‌లో చేతులు పోనివ్వాలనిపించింది – కళ్లతోనే స్పర్శించింది – తిరిగి వారి జీవితంలో ప్రవేశిస్తానని ఆమె అనుకోలేదు. పిచ్చిగా అప్రయత్నంగా – ఆ పార్కులోకి

---

**జరిగిన కథ–11 :** నాగయ్య, అమరేశ్వరిలకు ముగ్గురు కూతుళ్లు, ఒక్క కొడుకు విష్ణు. పెద్ద కూతుళ్లిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మూడవ కూతురు రమ్య, ఎదురింటి శ్రీకాంత్ ప్రేమించుకొంటారు. వాళ్లొకరోజు లేచిపోయి గుళ్ళో పెళ్లి చేసుకొని, కొత్త జీవితం ప్రారంభిస్తారు. ఇంటి యజమాని వెంకట్రావ్ భార్య సుగుణ రమ్యను తన సొంత చెల్లెలుగా చూసుకొంటుంటుంది రమ్యకు గర్భం వస్తుంది. ఈ వార్త పిల్లలు పుట్టని సుగుణకు బాధ కలిగిస్తుంది. కానీ ఆమె కూడా గర్భవతి అవుతుంది. వెంకట్రావ్‌కు కూతురు పుడుతుంది. శ్రీకాంత్ చిన్ననాటి స్నేహితురాలు డా॥ వసుంధర అతనితో అంత క్లోజ్‌గా ఉండడం సహించలేకపోతుంది రమ్య. రమ్య కొడుకు సుందర్‌కి ఓ రోజు జబ్బుచేస్తే వసుంధరే ఆదుకొంటుంది. అప్పట్నుంచీ వసుంధరను చేరదీస్తుంది రమ్య. వసుంధర శ్రీకాంత్‌ను తనవాడిగా చేసుకోవటానికి ప్రయత్నిస్తూంటుంది. తన వాడనుకొన్న శ్రీకాంత్ వసుంధర సొంతమైనాడని అనుమానించిన రమ్య, బాబుని వసుంధరకు అప్పగించి ఎటో వెళ్లిపోతుంది. శ్రీకాంత్ ఆ షాక్ నుంచి తేరుకొని తన దగ్గరకు వస్తాడన్న ఆశతో ఎదురు చూస్తుంటుంది వసుంధర. ఆమెకు వుత్తరం ద్వారా తెల్పి శ్రీకాంత్ కూడా ఎటో వెళ్లిపోతాడు. మెడికల్ రిప్రజెంటేటివ్ మూర్తి వసుంధర ఇంట్లో అద్దెకు దిగుతాడు. అతనితో చనువుగా వుంటుంటాడు సుందర్. సుందర్ తన గర్ల్ ఫ్రెండ్ లల్లీకి ఇల్లు మొత్తం చూపిస్తాడు. లల్లీతో తన తండ్రి మూర్తేనని అబద్ధం చెప్పి, మూర్తిని నవ్విస్తాడు. ఫైర్ ఆక్సిడెంట్‌కి గురైన వసుంధరను రక్షించుతాడు మూర్తి. అతనితో వసుంధర పెళ్లి జరిపించుతుంది ఆమె మేనత్త. అక్కడ నుంచి వెళ్లిపోయిన రమ్య ఓ ధర్మాత్ముని సహకారంతో ఓ అనాథాశ్రమములో టీచర్‌గా పనిచేస్తుంటుంది. ఓ రోజు ఆ అనాథాశ్రమములోని పిల్లలతోపాటు ఆమె కూడా 'ఎక్స్‌కర్షన్'కి బయలుదేరుతుంది. గతంలో ఎప్పుడూ తనూ, శ్రీకాంత్ కలుసుకొనే పార్కులో ఓ చెట్టు క్రింద దీనావస్థలో వున్న శ్రీకాంత్‌ను చూసి, అతని చేతుల్లో సొమ్మసిల్లిపోతుంది రమ్య. ఆమెను చేతులమీదకు ఎత్తుకొని ఆసుపత్రికి తీసుకుపోతాడు శ్రీకాంత్.

వెళ్ళింది. అలా ఎప్పటినుండి అక్కడ వున్నాడో!... వీరిద్దరిని చూసింది... మూడో వ్యక్తి ఎక్కడా ? ? అది ఇల్లు కాదు తను వున్నది హాస్పిటల్ అని గ్రహించింది. సుందర్ కనిపించివుంటే తన కోరిక తీరిపోయేది. ఏ కోరిక లేకుంటే ఎప్పుడు చనిపోటానికైనా సిద్ధంగా వుండేది. తీరని కోరికతో చనిపోతే ఆత్మకు శాంతి వుండదు. తను ఇక్కడ వుంటే వీళ్ళకి సమస్య అవుతాను. శ్రీకాంత్ తనను పోనిస్తాడా! తిరిగి కొత్త సమస్య తల ఎత్తుతుంది. వసుంధరకు తను ఇచ్చిన మాట ఏమి కాను. పైగా



వసుంధర గర్భవతి. ఆమెను దుఃఖపెట్టకూడదు. శ్రీకాంత్ తనెదురుగా మరొక స్త్రీతో కాపురం చేస్తుంటే చూసి సహించే శక్తి లేదు. దేవుడు తన జీవితాన్ని వేరే విధంగా వాడుకుంటున్నాడు — తన పిల్లలు తనకొరకు ఎదురు చూస్తుంటారు. తను కనబడకపోతే వారంతా ఏమనుకుంటారు. గాభరాపడి పోతుంటారు. వీరికి తెలియకుండా ఇక్కడినుండి నిష్క్రమించటమే అందరికీ మంచిది. శ్రీకాంత్‌ను చూసింది. ఆ తృప్తితో జీవితకాలం గడిపేస్తుంది. సుందర్ పెద్దవాడై తల్లిని వెదుక్కుంటూ ఏదో ఒక రోజు వస్తాడు — ఆ రోజు కొరకు ఎదురు చూస్తూ వుంటుంది — అని తలచి — కళ్లారా భర్తను చూసుకుంది. మెల్లగ — మంచం దిగి గదినుంచి బయటికి వచ్చింది రమ్య.

* * *

హాస్పిటల్ నుంచి బయటికి వచ్చింది. వెళ్లిపోతున్న రమ్యను, గేట్‌మాన్, వాచ్‌మాన్ చూశారు. పేషంటని అనుకోలేదు. పేషంటు తాలూకు వ్యక్తి





ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు డా. సి. నారాయణరెడ్డిగారిని అధికార భాషా కమిషన్ చైర్మన్‌గా నియమించిన సందర్భంగా మదరాసు మిత్రమండలివారాయనకి ఘన సన్మానం చేశారు. ఆ సందర్భంలో తాము రచించిన 'విశ్వంభర' కావ్యాన్ని శ్రీ రమణయ్యరాజాగారికి అంకితం యిస్తున్న డా. సి. నారాయణరెడ్డి.

ఆసి తలుపు తీశాడు గేట్‌మన్. ఆటో ఎక్కి జూలాజికల్ పార్కుకు పొమ్మంది. ఆటో కదిలింది. రమ్యకు మనస్సు ఆందోళనగా వుంది. సుందర్‌ని చూడలేదు — ఈ వూళ్ళోనే వుండివుంటాడు — మనస్సు వెనక్కి లాగుతోంది. తనొచ్చిన బస్సు ఇంకా అక్కడే వుంటుందన్న నమ్మకం ఏమిటి? జూలాజికల్ పార్క్ అంతా చూసి మరోచోటికి వెళ్ళివుంటే ? ఎక్కడని వెతుకుతుంది. బస్సుకోసం ఏ దారి కాయాలి ? ఈ వూరు నుంచి ఎంత త్వరగా పోతే అంత మంచిది. అనుకుంటుండగానే ఆటో పార్కు చేరుకుంది. దిగి ముందుకు వచ్చింది. అక్కడ వున్న బస్సును చూడగానే ప్రాణం కుదుట పడింది. పరుగులాంటి నడకతో బస్సు దగ్గరకు వెళ్ళింది. బస్సులో క్రింద, పైన పడుకుని వున్నారు. డ్రైవర్, కండక్టర్ చెట్టుక్రింద పడుకున్నారు. తోటి టీచర్స్ సీట్లపై పడుకున్నారు. వృద్ధుడైన వార్డెన్ బీడి త్రాగుతున్నాడు. రమ్యను చూడగానే "వచ్చావా తల్లీ" తేలిగ్గా నిట్టూర్చుతూ ముందుకు వచ్చాడు. ఆటోవాడు విసుక్కుంటూ డబ్బులు అడుగుతున్నాడు. వార్డెన్ డబ్బులు ఇచ్చి పంపాడు. రమ్య స్వరం వినగానే పతుల్లా లేచిపోయారు పిల్లలు.

"ఎక్కడికి వెళ్ళారు ? మేమంతా భయపడ్డాం... పోలీసు రిపోర్టు ఇద్దామనుకున్నాము..." అందరూ మాట్లాడుతున్నారు. ఏమి చెబుతున్నారో, ఏమి అడుగుతున్నారో ఒక్కటీ ఆమె తలకెక్కటం లేదు. అలిసిపోయినట్లు ఒక సీటుపై కూర్చుని కిటికీపై తల ఆనించి — కళ్ళు మూసుకుంది. ఆమెను మరింకెవ్వరు పలుకరించలేదు. లేపలేదు — అలా మౌనంగ రోజుల తరబడి వుండటం ఆమెకు అలవాటు. వారికి అది కొత్తకాదు. ఎవరి పనుల్లో వారు మునిగిపోయారు. కాలకృత్యాలు తీర్చుకుని ప్రార్థన చేసి, ఫలహారం చేశారు. బస్సు కదిలింది —

## రాగజ్వాల

చార్‌మినార్ దగ్గర ఆగింది. పిల్లలు లైను కట్టి నెమ్మదిగా అంతా దిగిపోయారు. రమ్య ఇంకా అలాగే కూర్చునివుంది. బస్సు కదిలి ఇంత దూరం వచ్చిందని కూడా తెలియదు. బస్సును తరుముకుని, రెండు కార్లు, ఒక ఆటో — పోలీసు జీపు వచ్చి బస్సు వెనుక ఆగటమూ రమ్య చూడలేదు. పోలీసులు బస్సును చుట్టుముట్టారు. ఆటోవాడు బస్సులో ఎక్కి ఆమె ఇక్కడ వున్నారు—అని అరచి చెప్పటమూ వినలేదు. అంతవరకు కొట్టుమిట్టాడుతున్న నరాలకు ఒకసారిగా రిలాక్స్ అయినట్లు—తనను తాను సంభాళించుకుంటూ సీటుపైకి వాలిపోయాడు శ్రీకాంత్. వెనుక టాక్సీలోనుంచి దిగిన విష్ణు పరుగులాంటి నడకతో ముందుకు పోబోతుంటే "మూర్తీ జాగ్రత్త - రమ్య వీక్‌గా వుంది — నెమ్మదిగా పలుకరించు", అని వారించింది, భర్త తొందరపాటు ఎరిగిన వసుంధర.

విష్ణు సిగరెట్ కాలుస్తూ రమ్యకు ఎదురు సీట్లో కూర్చున్నాడు. ఘాటైన వాసనకి ముక్కుపుటాలు చిట్లించుకుంటూ — కళ్ళు తెరిచింది. "హలో రమ్యా! నీకీ వాసన పడదని తెలుసు. కోపం వచ్చిందా ? తంతావా ?" అంటూ సిగరెట్ కిటికీలోంచి విసిరేశాడు.

"విష్ణు!!?"

"ఆ మగమహారాజును." రమ్య భుజాలచుట్టు చేతులువేసి పట్టుకుని లేపి, బస్సు దింపి నడిపించుకుంటూ కారు దగ్గరికి వచ్చాడు. వసుంధర కారుకు ఆనుకుని నిలుచుంది. ప్రక్కన సుందర్ వసుంధరను ఆనుకుని నిలుచునివున్నాడు. కన్నార్పకుండా సుందర్‌ను చూసింది. ఎగిసెగిసిపడే గుండెపై చెయ్యి వేసుకుంది.

"రమ్యా! మీట్ మై వైఫ్ వసుంధర—వాడు సుందర్ — సుపుత్రుడు..." అని అన్న మూర్తిని అర్థం చేసుకోలేక, విష్ణును, వసుంధరను — సుందర్‌ను మార్చి, మార్చి చూస్తున్న రమ్య భుజం తట్టి అక్కున చేర్చుకున్నాడు.

* * *

శ్రీకాంత్ రమ్య దగ్గరకు పోలేదు. ఆమెను చూడలేదు. రమ్యను క్షమించకూడదనుకున్నాడు. తనను విడిచి మళ్ళీ వెళ్ళిపోయిన రమ్యమీద కోపం వచ్చింది. కినుక వహించాడు. నేరుగ తన కారులో ఇంటికి వచ్చాడు. ఇంటికి తాళంపెట్టి వుంది. అద్దెకున్నవాళ్ల దగ్గరకు వెళ్ళాడు. వాళ్ళూ కొత్తవాళ్లే వారికి తెలిసినంతవరకు చెప్పారు. ఇంటిగల ఆమె చనిపోయింది. అమ్మాయి శుభ — పక్కింటి నాగయ్యగారింట్లో వుంటోందని చెప్పారు.

"అమ్మ లేదా ? చనిపోయిందా ? నాకు తెలియ లేదు. కొడుకుగా తన ధర్మాన్ని విస్మరించాడు. అమ్మ అప్పుడే చనిపోతుందనుకోలేదు. డబ్బు సంపాదనే తన ధ్యేయంగ పెట్టుకుని లక్షలు సంపాదించాడు. కోరిన కట్నం ఇచ్చి చెల్లి పెళ్ళి చేసి, అమ్మను క్షమించమని అడుగుదామనుకున్నాడు. ఎన్నోసార్లు తనవారిని చూడాలనిపించినా రాలేకపోయాడు. సిరి లేదు — తన స్త్రీ లేదు — అందరిలో చులకన అవుతాడని రాలేదు — తిరిగి సిరిని వెంట బెట్టుకుని వద్దామనుకున్నాడు. తనకు సంతోషం లేదు. అమ్మకు అదృష్టంలేదు" అని సరిపెట్టుకుని, ప్రక్కింటమ్మాయి రమ్య ఇంటికి వచ్చాడు. శుభ ఎదుట తల వంచుకుని కూర్చున్నాడు తప్పు చేసిన వాడిలాగ. శుభ అన్నను చూడగానే ఏడ్చింది. దుఃఖం తీర్చుకుంది.

చిన్న అల్లుడ్ని అన్నీ మరచిపోయి — మర్యాదలు చేశారు అమరేశ్వరి, నాగయ్యగార్లు.

రమ్య వెళ్ళిపోగా నాగయ్య కళ్ళు తెరిచాడు. తన బాధ్యతను ధర్మాన్ని గుర్తించి — పెద్దమ్మాయిలిద్దరికి పెళ్ళిళ్ళు చేశారు. ఉద్యోగినులు కనుక తొందరగా కుదిరిపోయాయి సంబంధాలు. ప్రతి నెల ఇంటికి జీతాలందిచ్చే భార్య కావాలని కోరుకుంటున్నారు — ఈ కాలం మగవాళ్ళు.

అమ్మాయిలు అత్తనారింటికి వెళ్ళిపోయారు. శుభ ఒక్కదాన్ని అలా వదిలేసి వుండలేకపోయింది అమరేశ్వరి. వెళ్ళి ప్రతిమాలి తెచ్చి ఇంట్లో పెట్టుకుని స్వంత కూతురిలా చూసుకుంది.

అమరేశ్వరి, నాగయ్యలకు పాదాభివందనం చేసి తన కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

చిన్న కూతురు కొడుకు పెద్ద మనవడిని చంకన ఎత్తుకుంది అమరేశ్వరి. అంతమంది ఆత్మీయులు తనను తలమీద ఎక్కించుకుని ముద్దు చేస్తుంటే వుక్కిరిబిక్కిరి అయ్యాడు సుందర్.

నాగయ్య భుజాలమీదకు ఎక్కిన సుందర్‌ని క్రిందికి దింపుతూ "తాగినవాడిలా వాడికి మత్తెక్కిపోతుంది గర్వంతో, దింపండి నాన్నా !" అన్నాడు విష్ణు.

"నీవు సెకెండ్ ఫారమ్ నుంచే సిగరెట్స్ తాగుతున్నావని తాతయ్యకు చెప్పనా" అని సుందర్ బెదిరిస్తే విష్ణు అక్కడనుంచి పరుగెత్తిపోయి వసుంధర ముందు నక్కాడు.

* * *

రమ్య కళ్ళు శ్రీకాంత్ కొరకు గాలిస్తున్నాయి. శ్రీకాంత్ రమ్యకు కనుపించనేలేదు. వున్నా పదిమందిలో తిరుగుతున్నాడు. తనవైపు చూడటం లేదు. మాట్లాడటానికి ప్రయత్నమే చేయలేదు.

ఇంటిముందు బస్సు ఆగింది. పిల్లలు పరుగెత్తుకువచ్చారు, "మీరు ఎప్పుడు వస్తారు!" అంటూ. 'మేము ఇక్కడే వుంటాం, మాకు ఇక్కడే బాగుంది' అని కొందరు మారాం చేస్తున్నారు.

శ్రీకాంత్‌కు తను అవసరమున్నా లేకపోయినా ఆ పిల్లలకు తన అవసరము ఎంతయినా వుంది. ఆ పిల్లలు తనవాళ్ళు, వారి బాధ్యత నాపై వుంది.

"మావాళ్లని చాలా రోజులకు చూశాను, కొన్నాళ్ళు వుండి తప్పక మీ దగ్గరకి వస్తాను. అందాక జాగ్రత్తగ వుండండి" అంటూ పేరు పేరున పిలిచి ముద్దు చేసింది. వసుంధర వాళ్ళందరికి విందు చేసింది. కొత్త బట్టలు కొనిచ్చింది. తన సహాయం వారికి ఎప్పుడూ వుంటుందని మాట ఇచ్చింది. రమ్యను తొందరగ రావాలని చెప్పి, పాటలు పాడుతూ, మాకు అమ్మ కావాలి ! అమ్మ రావాలని పాడుతూ, అరుస్తూ వెళ్ళారు.

* * *

రమ్య తన గదిలో పడుకుంది. ఎన్నాళ్ళకి, తిరిగి తన గదిలో పడుకుందీ ! అమ్మ దగ్గర వున్న

పోయి, నిశ్చింత ప్రపంచంలో మరెక్కడ లేవు! అని అనుకుంది.

శ్రీకాంత్ మంచివాడు కాదు. తనకు అన్యాయమే చేశాడు. స్త్రీ సిరి, సంపదలకన్న భర్త అనురాగాన్ని వాంఛిస్తుంది. కోటి రూపాయలకన్నా, భర్త ప్రేమను కోరుకుంటుంది...

ఆలోచనలో వున్న రమ్య దగ్గరకు వసుంధర వచ్చి ప్రక్కన కూర్చుంది.

"నీవింకా ఇక్కడే వున్నావా? శ్రీకాంత్ దగ్గరకు వెళ్లలేదూ! అతను ప్రయాణమవుతున్నాడు ..."

"..............."

"రమ్యా! అతని సంగతి నీకేమి తెలియదా!"

"వుహు."

"నీ కోసం దేశాలు తిరుగుతూంటే, ఒకరోజు ఓ కారు వచ్చి చెట్టుకు గుద్దుకుంది. డ్రైవర్ చనిపోయాడు. యజమానికి బలమైన గాయాలు తగిలాయి. రక్తం కారిపోతూంది. యమయాతన పడుతున్న అతన్ని ఎవ్వరూ పట్టించుకోలేదు. పాపం అంటే దోషం చుట్టుకుంటుంది. కోర్టు చుట్టూ తిరగాలి, పోలీసులతో గొడవ ఎందుకు — బెడద అనుకుంటూ వెళ్లిపోతున్నారు.

పిచ్చివాడైన శ్రీకాంత్‌లో ఇంకా మానవత్వం వుంది. అతన్ని ఆసుపత్రిలో చేర్పించి, తన రక్తాన్ని దానం చేశాడు. పోలీసు కేసు పూర్తి అయ్యాక డ్రైవర్‌కి దహన సంస్కారాలు చేశాడు.

శ్రీకాంత్ వ్యక్తిత్వాన్ని చవిచూసిన అతను, శ్రీకాంత్‌ను తన ఎస్టేట్‌కు తీసుకుపోయాడు.

"శ్రీకాంత్ ఎవ్వరు? తానెవ్వరు? భాష వేరు, రాష్ట్రం వేరు. అయినా అతని రక్తం తనకి సరిపోయింది. గొప్ప — బీదా! నలుపు — తెలుపు — కుల మతాలు శరీరానికి లేవు. మానవులంతా ఒకటే" అంటూ శ్రీకాంత్‌ను మేనేజర్‌గా నియమించాడు.

శ్రీకాంత్ మంచితనం — నీతి, నిజాయితీలు అతని పెట్టుబడిగా పెట్టుకుని, వ్యాపారంలో భాగం ఇచ్చాడు.

"రమ్యా! నీ కోసం శ్రమించాడు. నీవు వున్నావనే నమ్మకంతో రూపాయి, రూపాయి కూడ వేశాడు ..." అని చెప్పి, వసుంధర రమ్యవైపు చూసింది.

"నేను ... నేను ... కోరుకుంది రూపాయలు కాదు."

"నాకు తెలుసు నీవు ఎందుకు అలా అంటున్నావో ... రమ్యా! నీవు వూహించినట్లు నేను ... శ్రీకాంత్...ఏమి కాలేదు. మీకు ప్రకృతి కూడ సహకరించింది. ఆ రోజు వురుములతో వర్షం వచ్చింది. ఆఘ్రాణించబోయిన పుష్పాన్ని జారవిడిచి నీ దగ్గరకు వచ్చాడు. ఆ రోజు శ్రీకాంత్‌ను తిట్టాను. కాని ఈ రోజు చేతులెత్తి నమస్కరిస్తున్నాను ..."

అంతలో "వసూ!" విష్ణు పిలిచాడు.

వసుంధర నవ్వుతూ "వస్తాను! మగ మహారాజుకు ఏం అవసరమొచ్చిందో!" అంటూ వెళ్లిపోయింది.

రమ్య మంచానికి అతుక్కుపోయినట్లు పడుకుంది. శ్రీకాంత్ తన దగ్గరకు 'వస్తాడు — వస్తాడు' అని ఎదురు చూసింది.

కృష్ణపక్ష చంద్రుడు మెల్లగా పైకి వచ్చాడు. ప్రక్కింటి మేడపై గదిలో లైటు వెలిగింది. రమ్య మంచంపై నుంచి లేచింది. అలంకరించుకుంది.

నక్షత్రాలను కళ్లకు అమర్చుకుందా అన్నట్లుగ కళ్లు మెరుస్తున్నాయి. రాత్రి నలుపు ఆమె జుట్టులో చిక్కుకుపోయింది. వెన్నెల ఆమె శరీరానికి అంటుకుపోయినట్లుంది. పూల సౌరభాలను వెంటపెట్టుకుని కొత్త పెళ్లి కూతురులా ఆ గదిలోకి అడుగు పెట్టింది.

మంచంపై వెల్లకిలా పడుకుని కప్పుకేసి చూస్తున్న శ్రీకాంత్ రమ్యను చూశాడు. ఆ కళ్లల్లో మెరుపులు మెరవలేదు. కోపం చూసింది. తనను చూసి గబుక్కున ముందుకు రాలేదు. అతి మామూలుగ వున్నాడు. రమ్య అలంకరణ చూసి తబ్బిబ్బుకాలేదు.

కన్నుల్లో కనులు కలిపింది. శ్రీకాంత్ కాస్త కూడా చలించలేదు; పరికదా నీవెవరివో నాకు గుర్తులేదన్నట్లుగా కళ్లు మూసుకున్నాడు.

రమ్యకు తెలుసు. శ్రీకాంత్‌కు తనపై కోపం వచ్చిందని, శిక్షిస్తున్నాడని.

పడుకున్న శ్రీకాంత్‌ను చూస్తుంటే హృదయం ఎగసెగసి పడుతోంది. శ్రీకాంత్‌కి తనపై వచ్చిన కోపం ఎలా పోతుంది!!

ఒకటి రెండు మూడు నిముషాలు గడిచాయి. మౌనం ఆ గదిలో నాట్యమాడుతోంది.

శ్రీకాంత్ ఎంతసేపు కళ్లు మూసుకుని వుండగలడు?

శ్రీకాంత్ కళ్లు విప్పాడు. మరుక్షణంలో విచ్చుకున్నాయి.

గుప్పుమని వెలిగాయి. గబుక్కున లేచి కూర్చున్నాడు. రమ్యను కన్నార్పకుండా పూర్తిగ క్షణం చూశాడు. జడలోని గులాబి పూవు చేతిలో పెట్టుకుని, కాలుమడిచి, వయ్యారంగా ... నగ్నంగా నిలుచుని వుంది. పాలరాతి విగ్రహంలా, పింగాణిబొమ్మలా నిలుచుని వుంది.

"మై గాడ్ !!" శ్రీకాంత్ ఊపిరి బిగపెట్టి చూశాడు. సిగ్గుతో రమ్య చెంపల్లో మందారాలు విచ్చుకున్నాయి.

రమ్య చూసిన చూపుకు 'రాగజ్వాల' రగులుకుంది. రాకెట్‌లా ముందుకు దూసుకు వెళ్లాడు. రమ్యను చుట్టేశాడు.

రమ్య అతి నాజూగ్గా శ్రీకాంత్ మెడను కౌగిలించుకుంది. మెడ వంపులో ముఖాన్ని దాచుకుంది.

రమ్యకు చెప్పలేనంత సిగ్గు. అన్ని రోజుల కాపురంలో ప్రతిరోజు కొత్తగా సిగ్గు పడుతోంది. "భర్త ముందు సిగ్గేంటి? చూడు నేను సిగ్గు పడుతున్నానా?" అని ఎన్ని మాటలు చెప్పి మరిపించి చూసినా తన సౌందర్యాన్ని ఎప్పుడూ దాచుకునేది. సిగ్గుతో పువ్వులా ముడుచుకుపోయేది.

ప్రియురాలి సౌందర్యం, తన భార్య నగ్న సౌందర్యాన్ని చూడాలన్న కోరిక, తీరని కోరికగానే వుండిపోయింది. తన కోరిక తెలిసిన రమ్య ఈ విధంగా తనను లొంగదీసుకుంది! అని తెలుస్తూ...

"రమ్యా! ... నీకు పొగరెక్కువ. నీ పొగరే నాలో జ్వాలను రేపుతోంది. నా కాళ్లమీదపడి నన్ను క్షమాపణ వేడుకుంటావని ఎదురు చూశాను. నిన్ను వేధించాలన్నంత కోపం వుంది. కాని ... నీవిలా నన్ను లొంగదీసుకుంటావని అనుకోలేదు. నా కోపం వుఫ్‌మని ఎగిరిపోయింది. అయినా నాకు బాధలేదు. మహా సంతోషంగా వుంది" అని మెత్తగా పలుకుతూ అవలీలగా ఎత్తుకుని, అడుగడుక్కి ముద్దు చేస్తూ పడకమీదకు చేర్చాడు.

'రాగజ్వాల' వారిద్దరినీ చుట్టు ముట్టింది. ఆ జ్వాలలో మెల్లి మెల్లిగా కరిగిపోయి ఒకరిలో ఒకరు లీనమైపోయారు.

*(అయిపోయింది)*



# ఇదీ ఒక పరీక్షే!

## మంజుశ్రీ



శ్రీ పీతాంబరాచార్యులు ఎమ్. ఏ. ఎగ్జామినరుగా అనంతపురం వెళ్ళాడు. వెళుతుంటే కాస్తంత డాబు, కొంచెం టెక్కు అనిపించకపోలేదు మనసుకి. సుమారు పదిహేనేళ్ళ క్రితం కోటి వేల్పులకి మొక్కుకుంటూ తాను రాసిన పరీక్ష కిప్పుడు తానే పరీక్షకుడు కావడం — ఓహ్ తాను కల కన్నాడా అప్పుడు?

ఇప్పుడు అందరూ తనవైపే చూస్తున్నట్లనిపిస్తున్నది. 'ఈనేరా మన ఎగ్జామినర్' అని ఎట్లానో తెలుసుకున్నారు. దండాలు పెట్టేస్తున్నారు. చిరునవ్వుతో వాటిని స్వీకరించేస్తున్నాడు!

జీవితం ఎప్పుడూ ఊహల్లోనే బాగా వుంటుంది. అనుభవంలోకి వచ్చేసరికి ఆ ఊహ మాధుర్యం కాస్తా కరిగిపోతుంది. కరిగిపోవడమే కాదు కాస్త కారం, కొంచెం ఉప్పు, కొద్దిగా చేదు కూడా తగులుతాయి.

ఏమీ డాబు లేదు, ఏమీ గొప్ప లేదు. చర్చించాల్సినవాళ్ళతో ఏదో చర్చించాననిపించాడు. ఇక్కడిక్కడ సంతకాలు పెట్టమంటే పెట్టేశాడు. డబ్బు జేబులో పడేసుకున్నాడు. ఇక వాట్ నెక్స్ట్?

పీతాంబరాచార్యులుకి జ్ఞానివవుదామని చిన్నప్పుడు మహా తపనగా వుండేది. కాని ఏం లాభం? బి. ఏ. చదువుకుండే రోజుల్లో కలెక్టర్‌గారమ్మాయి రోజూ రెండుసార్లు కనిపిస్తే చాలు 'శ్రీ కైవల్య పదంబు చేరితిని నేనిప్పుడే' అనుకొనేవాడు. ఆ అమ్మాయి తన క్లాసైతే ఎంతో బాగుండేది కదా క్రూరవిధీ అని బాధపడేవాడు. ఆ అమ్మాయిది తనకంటే ఒక్క క్లాసు తక్కువ. అయితేనేం రోజూ కనీసం రెండుసార్లైనా ఎక్కడోక్కడ దర్శించుకునేవాడు. ఏవేవో కలలు కనేవాడు. మూరెమ మున్నొక్క అయిదు డిగ్రీల వెన్నకోణంలో తన వాలుగనులను (తెలుగంటే మహా పడిచచ్చేవాడు) అదో విలాసంగా పక్కకి మళ్ళించి పూలమాల వేస్తుంటే 'కాస్తంత తలన్నా వంచదేమమ్మా ఈ కొంటెకుర్రాడూ' అని అందంగా విసుక్కుంటున్నట్లు మనస్సులో బొమ్మలు గీసుకుంటూ ఉలికిపడుతుండేవాడు.

తర్వాత రోగం చప్పగా కుదిర్చారు తనని కన్నవాళ్ళూ, తన పెళ్ళాన్ని కన్నవాళ్ళూ కలిసి. పెళ్ళి చేసుకుంటేనే నీ మొహానికి ఎమ్. ఏ. గీత అన్నారు కన్నవాళ్ళు. విధిలేక తలవంచాడు. శకుంతల

ఆనే అమ్మాయిని పెళ్ళి చేసుకుని, ఆ తర్వాత దానికి కొన్నాళ్ళు వాయిదా వేసి చదువు వెలగబెట్టాడు.

జ్ఞాని కాలేకపోయినా ఈ లోకంలో తనచుట్టూ ఏం జరుగుతున్నది తెలుసుకోవాలన్న ఆతృత మాత్రం తగ్గలేదు ఆచారికి.

సాయంకాలం ఆరు గంటలకు పుట్టపర్తి పోయే బస్సు వున్నదట. ఎంక్వైరీ చేశాడు. ఎవరైనా తన వెంటవస్తే బావుండును అనే వుద్దేశాన్ని సున్నితంగా వ్యక్తపరుస్తూ...కాని కొందరు వింతగా చూశారు. కొందరు తమ అనంగీకారాన్ని వ్యంగ్యమైన నవ్వులతో తెలియ చేశారు. అంతేకాదు కొందరు 'ఇదేమిటి ఇంత వెనక పడిపోయిన భావాలు ఈ పీతాంబరాచారివి' అన్నట్లు చూశారు. దాంతో అతడికి వెళ్ళి చూసిరావాలన్న కోర్కె మరింత బలపడింది. ఎందుకీ వైరుధ్యం. నిజానికి రెండు వైపులెందుకు? సత్యానిది ఎప్పుడూ ఒక్కటే రూపు కదా!

పుట్టపర్తిలో అంతా ప్రదర్శన అన్నట్లు తమ ముఖాల్లో భావ ప్రకటనం చేస్తారెందుకు కొందరు? కొందరేమో పూర్తిగా తమని తాము అర్పించుకుంటారెందుకు? మనిషి జీవితంలో ఆధ్యాత్మికానుభవాలున్నాయో లేవో — అవి కేవలం భ్రమలేనేమో! లేక ఏదో చైతన్యం, ఏదో జ్వాల, ఏదో పులకరింత, ఏదో విద్యుదావేశం ఒంట్లో పాకడం, మనస్సు ప్రశాంతి నందడం, ఇలాటి అనుభవాలున్నాయో లేవో! అమాయకులు, ఆర్తులు కేవలం ఎండమావిలో దప్పి తీర్చుకోవడానికి పరుగులెత్తడమేనేమో! ఏది ఏమైనా అక్కడ చెడ్డ పనులేవీ జరగడం లేదుకదా. సమాజ విరుద్ధకార్యకలాపాలు జరగడం లేదుగదా! అందరూ హాయిగా వుండండి. ఇలా ప్రవర్తిస్తే హాయిగా వుండగలుగుతారు. ఎవరినీ ద్వేషించవద్దు. అందరినీ ప్రేమించాలి — అనే కదా బాబాలు, మఠాలు, యోగులు, యోగినులు చెపుతున్నది. కాబట్టి వెళ్ళి చూస్తే తప్పలేదు. అదో జగత్తులోని భయంకర కార్యకలాపాలక్కడ వుండవు. ఈ దుర్మార్గాలను నిరసించడానికి కాని, తమచేతనైనంత ఎదుర్కోడానికి కాని, బట్టబయలు చేయడానికి పూనుకోవడంగాని చేయక, ఆధ్యాత్మికతని ప్రచారం చేసేవాళ్ళను దాంభికులని, మోసగాళ్ళని కొందరు దుష్ప్రచారం చేస్తారెందుకో —

అక్కడ జీవితం ఎలా వుంటుంది? అక్కడ చేరిన వాళ్ళందరూ ఎలా వుంటారు? నిత్యకృత్యాలేమిటి? ఇవి చూడాలని కుతూహలమైతే కలిగింది ఆచారికి.

ఆరు గంటలకి తాను చేరగలడో లేడో! అని గుంజాటన పడ్డాడు. యూనివర్శిటీ కేంపస్ నుంచి ఊరికి దూరమే. ఎలానో చచ్చీచెడి ఐదూయాభైకి బస్‌స్టాండ్ చేరుకున్నాడు. విచారణ దగ్గర విచారంగా అడిగితే వాళ్ళు సంతోషంగా బస్సు వెడిపోయింది, ఇంకో గంట లేటుగా బయలుదేరుతుందేమోనని చెప్పారు. అప్పుడే ఏదో ఆధ్యాత్మికానుభూతి ప్రారంభమైంది అనిపించింది పీతాంబరాచారికి. మేథమేటిక్సులో డాక్టరేట్ అయితే సంపాదించాడు కాని ఈ పరిణామానికి సమన్వయం కుదరలేదు. సరిగ్గా ఆరు గంటలకి బయలుదేరితే తాను అందుకోలేడని వెడిపోయిందా! పొద్దున్న నాలుగు మెతుకులు తినీ తిననట్లు వున్నందువల్ల తను కడుపునిండా భోం చేయడానికి వెడిపోయిందా బస్సు? తాను ఊళ్ళోకి వెళ్ళి భోంచేసి వస్తే ఈలోపున అరగంటలోనే బాగు పడిపోయి వెళ్ళిపోతుందా? ఎవరిదైనా అదృశ్య హస్తం తన చేయి పట్టుకొని లాక్కొని వెళుతున్నదా? వెడిపోయిన బస్సు గంటవాకా బాగు పడదంటున్నారు, ఒకవేళ అరగంటలోనే బాగై వెళ్ళిపోతుందేమో! అప్పుడెలాగా, అని ఎంక్వైరీలో అడిగితే ఇంత అమాయకుడు ఇన్నాళ్ళకి మనకి దొరికాడని వాళ్ళు కడుపుబ్బనవ్వారు. చిన్నపుచ్చుకున్నాడు పీతాంబరాచారి. 'భోంచేసి రావచ్చా' అని అడిగాడు. 'మహారాజాగా భోంచేసి రండి' అన్నారు వాళ్ళు.

ఆకాశంలో రంగు రంగుల మబ్బులు. వాతావరణంలో సాయంకాలపు సంగీతం. పళ్ళు, పువ్వులు, పత్రికలు అమ్మేవాళ్ళ కేకలు, అరుపులు, దుమ్ము. దూరంగా రైలు కూత హడావుడి. ప్రతిరోజూ ఇదే దృశ్యం, ఇదే ధోరణి. చెట్లమీద పక్షులు కోలాహలంగా రోజూ చేరేచోటే అయినా వెతుక్కుంటున్నాయి.

వాళ్ళనీ, వీళ్ళనీ అడిగి దగ్గర హోటల్‌కి చేరుకున్నాడు. రెండు చపాతీలు తిన్నాడు. పాలు దొరుకుతాయంటే పాలు తాగాడు. బయటికి వచ్చి రెండు అరటిపళ్ళు తిన్నాడు. మీఠాకిళ్ళీ వేసి సిగరెట్ ముట్టించాడు. 'మగ పుట్టుకయే కదా మధురం, ఆహా ధన్యం, ఓహో అందం' అని పాడాలనిపించింది. ఉన్న ఊళ్ళో చారవగా సిగరెట్లు తాగడు పీతాంబరాచారి. భయం కాదుకాని అదో సంకోచం. మేష్టారు సిగరెట్టు కూడా కాల్చరు; ఇక తక్కినవా?!? తప్పు తప్పు అని కుర్రాళ్ళు అనుకోవాలని బోలెడు సరదా శ్రీమాన్ ఆచార్ల వారికి. పెళ్ళానికి కూడా సిగరెట్ పడదని కొంచెం భయమే. నిజం చెప్పొద్దూ! ఆమె పుట్టింటికెళ్ళి నప్పుడు ఇంట్లో అతి రహస్యంగా త్వర త్వరగా దమ్ములు పీల్చడం సంగతి అలా వుంచి.

ఏడూ ఇరవైకి బయలుదేరింది బస్సు. ఎన్నింటికిచేరుతుంది అక్కడికి? అని ఎవరినో అడిగితే పదిన్నరకి పైమాటే అన్నారు. కాస్త మనస్సు బరువెక్కింది. గడచిన రాత్రి నిద్రలేదు. అది కొత్త చోటు. గది దొరుకుతుందో లేదో, ఎప్పుడూ ఒకటే రష్షట కదా! ఎందుకీ ప్రయాణం పెట్టుకున్నానా అనిపించింది.

రొప్పుతూ రోజుతూ, ఒగరుస్తూ, ఆయాస పడిపోతూ, కొప్పు విడిపోయి బుజాలమీదికి జారిపోతుండగా, కొంగు జారిపోతుండగా ఒక చిన్న వయస్సు ఆడకూతురు "అన్నా అన్నా ఆపండి ఆపండి, ఒక్క చెనం. ఒక్క మినిట్టు" అంటూ వచ్చిపడింది, పుట్టపర్తి బస్సే గదా అన్నా అంటూ. బస్సు ఆగింది. మరి ఆమె ఎక్కలేదు.

ప్రయాణీకులు ఎక్కే ద్వారంలో ఆమె తెచ్చిన పెట్టె పట్టేట్లు లేదు. పైకి ఎక్కించే లైసెన్స్ కూలీలెవ్వరూ అక్కడ లేరు. ఆ పెట్టె తానే ఎత్తబోయింది. చేతకాలేదు. ఇంతలో రిక్షా అతను పేచీ పెట్టుకున్నాడు. తనదగ్గర చిల్లరలేదు. రెండు రూపాయలు ఇచ్చేయ్‌మంటున్నాడు.

"ఏం ఆడకూతురిని చూస్తే అలుసా! రూపాయికి ఒప్పుకొని రెండు రూపాయలిమ్మంటావా? ఇది నీకు న్యాయమా! చూడండి బాబూ మీరైనా చెప్పండి!" అని వాళ్ళ మొహంలోకి వీళ్ళ మొహంలోకి చూసింది. కుదురైన మొహం. చక్రాల్లాంటి కళ్ళు. అందమైన వయసు. కాకపోతే అద్దంమీద దుమ్ము కొట్టుకున్నట్లున్నది. డ్రైవర్ మూడుసార్లు స్టార్ట్ చేశాడు. కండక్టర్ రెండుసార్లు విజిలిచ్చాడు.

"రేపొద్దున రావమ్మా. అసలే మేం వస్తుంటే లేట్లైపోయి, నీదో బాగోతమా" అని కండక్టర్ విసుక్కుంటున్నాడు.

"నా తండ్రి నా తండ్రి నాయన్నాయన వొంటరి ఆడకూతురిని నాయంగాదు, షిరిడి నుంచి వొస్తన్నా ఈ రాత్రి ఏడుండను ఈ బస్సుపట్టాందు కాడ. అక్కడికెళ్లిపోతే మరి సిక్కులేదు" అని బతిమాలుతోంది.

కండక్టర్ మెత్తబడ్డాడు. నా కాడ కూడా అర్ధరూపాయి లేదే — ఆ రిచ్చావుడిసిని ముందు పంపించు. ఆ పెట్టె సంగతి నే జూసుకుంటాను అన్నాడు. ఒకళ్ళవేపు ఒకరు చూసి విసుక్కునేవాళ్ళే కాని చిల్లర ఇచ్చి ఆ చిక్కు విప్పుదామని ఎవరూ అనుకోరు.

పీతాంబరాచార్యులు అర్ధరూపాయి బిళ్ళ ఇచ్చి రిక్షా అతనికి ఇవ్వమన్నాడు. రిక్షా అతను కోపంతో అర్ధరూపాయి తీసుకొని పెట్టె లోపలికి ఎత్తడంలో ఒక్క చెయ్యికూడా అందించకుండా వెళ్ళిపోయినాడు. లోపలవచ్చికూచుందా అమ్మాయి.

"ఏం తల్లీ బోషాణం ఎంటబెట్టుకొచ్చావు?! ఇంతకన్నా చిన్నపెట్టె దొరకలేదా? సంసారమంతా ఎంటబెట్టుకొచ్చినట్లున్నది" అని చెమట తుడుచుకున్నాడు కండక్టరు. ఆ అమ్మాయి కిసుక్కున నవ్వింది.

దీపం తీస్తే కాంతి పోతుంది కాని, ఈ నవ్వు అలాటిదికాదు. తర్వాతకూడా చాలాసేపుకనపడుతుంది అనిపించింది పీతాంబరాచారికి. మనసులో ఏవిటో ఆనందరేఖ మెరిసింది. 'ఇంకా నయం నా మొగుణ్ణి కూడా అందులో పెట్టుకొచ్చానన్నావు కాదు' అంటూ చిన్నగా చిలిపిగా నవ్వింది. కండక్టర్ ఘొల్లున నవ్వాడు.

"అమ్మగారిని ఏడనో చూసినట్లుందే" అన్నాడు.

"రెండేళ్ళకి, మూడేళ్ళకి ఓసారి ఇట్లా ఒస్తానే వుంటా — పుట్టపర్తి. ఈసారే నాలుగేళ్ళయిపోయింది. కిందటి నెల్లో బయలుదేరాను. ముందు షిరిడీ పోయినాను" అని సోది మొదలెట్టింది. కండక్టర్ టికెట్లు చూడటానికి లోపలికి వెళ్ళడంతో మాటలాపేసింది.

"చూశారా బాబుగారూ, ఒంటరిదాన్ని ఆడకూతుర్ని చూస్తే ఎవరికైనా అలుసే — భయం లేదు. ఎంత పేచీపెట్టాడు. ముదనష్టపోడు" అని పీతాంబరంవైపు తిరిగింది ముందు సీటులోంచి వెనక్కు.

అప్పుడు స్పష్టంగా చూశాడు, కళ్ళలోకాంతి. అందమైన పలువరుస.

''ఎక్కడినుంచి వస్తున్నారు ?'' అని అడిగాడు ఆచారి.

ఇదివరలోనే బాగా పరిచయమైపోయి బి.ఏ.లో తన క్లాస్‌మేట్ ఏమోనన్నంత అభిమానంగా. పూర్తిగా ఇటువైపు తిరిగిపోయింది ఆ అమ్మాయి. ఆ సీట్లో ఇంకెవ్వరూ లేరు. అదీ స్వారాజ్యం.

''షిరిడీ నుంచి వస్తున్నాను బాబుగారూ. మీరెప్పుడైనా షిరిడీ వెళ్ళారా ? ఎల్లకపోతే ఎల్లి చూసిరాండి. మీకు తప్పక మనసులో అనుకున్నది జరిగితీరుద్ది.''

పీతాంబరాచారి కొంచెం ముందుకి జరిగాడు పరిచయంతో. ''అయితే మీరనుకున్నది జరిగిందా ?''

ఎందుకడిగానా అనుకున్నాడు మసక కాంతిలో ఆ పిల్ల పెదవులు ముడుచుకున్నాయి. ఏవిటో నిస్పృహాయత కళ్ళలో కదలాడింది. 'బాబుగారూ ! మీ డబ్బులు ధర్మారంలో ఇచ్చేస్తాను. అక్కడే వో రెండు అరటిపళ్ళు కొనుక్కుంటానులెండి. ఇక ఈ పూటకి మనకి అన్నం లేదు. ఆడ గేటుకూడా మూసేస్తారు. ఆ మేనేజర్ నాకు తెలుసులెండి. ఓపాలి ఏమైందను కున్నరు ? పెద్ద జగడమైపోయింది. నన్ను ఆడాళ్ళ చావిడికి పంపించాలని ఎంతో గింజుకున్నాడు. నేనేమో పోనంటాను. పెద్ద గోల. మీకు తెలీదు బాబు ఆ చావడిలో బతకనియ్యరు.'

పీతాంబరాచారికి భయమేసింది. కుతూహలమూ కలిగింది. ఇదేమిటి ? ఇక్కడకూడా పోట్లాటలూ కొట్లాటలూనా –

'మీ పేరేవిటండీ' అని అడిగాడు పీతాంబరాచారి.

''నా పేరు సర్వతవర్ధని అయ్యా. నాకు పలకటం కూడా సరిగా రాదు. నేనేమీ చదువుకోలేదండీ. స్కూలు ఫైనల్‌దాకానైనా చదువు చెప్పించమని నేనెంతో పోరానండీ అయ్యగారూ – మా అయ్యా అమ్మా వైరిబాగులోళ్ళండి. పూజలు దేవుళ్ళా ఇయ్యేనండి వాళ్ళకు. చదువు చంద్యా అక్కర్లేదండీ. నాకు పదిహేనేళ్ళన్నా నిండకుండా పెళ్ళి చేశారండి. ఆళ్ళకి లక్షలున్నాయనీ, అరవై యకరాల మాగి ఋందనీ, లారీ వ్యాపారమనీ, చిన్నప్పుడే ఇచ్చి చేశారండీ.''

'ఇకనేం మరి.' అన్నాడు పీతాంబరాచారి ఊరుకో లేక.

''మీరుకూడా అట్టా అంటారేటండయ్యా. బతుక్కి సుకం, మంచీ చెడ్డా లేకపోయినకాడికి అయన్నీ ఎందుకండీ.'' అని గిరుక్కున అటువేపు తిరిగింది.

పీతాంబరాచారికి ఆ పిల్ల మెడ, మెడపైని అందమైన జుట్టు, కాస్త ముందుకి వంగినప్పుడు వీపూ కనపడుతున్నాయి. మనసులో ఏవిటేవిటో ఊహలు కదులుతున్నాయి. మొగుడిమీద బాగా ద్వేషం లాగుంది ఈ అమ్మాయికి. అతడి ఊసెత్తితేనే ఇలా అయిపోతోంది. ఇదివరలో చాలాసార్లు వచ్చాను పుట్టపర్తి అంటున్నది ఈ రాత్రికి ఈవిడున్న చోటే తానుండిపోతే – ఛీఛీ ఛాఛా తూతూ ధూధూ అంటున్నారెవరో మనసులో. అసంకల్పిత చర్యా పరంపర.

ఇంతలో మళ్ళీ వెనక్కుతిరిగింది ఆ అమ్మాయి.

# ఇదీ ఒక పరీక్షే !

తన పేరుకూడా తనకు పలకడం రాదంటున్న ముద్దరాలు.

''మీకేం ఉద్యోగమండీ – ?''

''ప్రొఫెసరంటారులే. ఎమ్. ఏ. చదివే పిల్లలకి పాఠాలు చెపుతాను.''

మొహమంతా కళ్ళే అయిపోయినవి వర్ధనికి.

''బాబుగారు ! మీరు నాకు సాయం చేస్తా నంటే మా బాబుని తీసుకొని మీయెంట ఏస్తానండీ. ఆడ ఆస్టలున్న మంచి స్కూల్లో చేర్పించాలి. మీకు పెద్దపెద్దోళ్ళెందరో తెలిసుంటారు. దిక్కులేని దానికా మాత్రం సాయం చెయ్యండి బాబయ్యా. నా దగ్గరింకా ముప్పైరెండు కాసు లున్నాయి. నా బాబు పెద్దసదువులు సదవాలి. బుద్ధిమంతుడు కావాలి.''

(పీతాంబరాచారికి హాయి హాయి అనిపించబోయి, జావ జావగారిపోతున్నట్లనిపించింది.)

'ఈ రాత్రి మనమెక్కడుండాలి' అని అడిగాడు.

'ఓహ్ జాగా దొరుకుద్దిలెండి. మీరేం దిగులు పడకండి. నేను గట్టిగా నోరు చేసుకుంటాను. అంతగా సత్రంలో దొరక్కపోతే గది ఇమ్మని అడుగుదాం.'

(నిజంగా ! అంత అదృష్టమా !)

''బాబూ, నేనోటి చెపుతాను. మీరేమీ అనుకో కండి. మీరూ, మేమూ ఒక కులం వోళ్ళంగాము. కాకపోతేనేం, నేను సుబ్బరంగా చేస్తాను వంట. నాలుగింటికల్లా లేచి రోజూ తలారా స్నానం చేస్తాను. నలభై ప్రదక్షిణాలు చేస్తాను. నా దగ్గర పప్పూ, ఉప్పూ, బియ్యం అన్నీ ఉన్నాయి. రెండు మామిడి కాయలు కూడా వున్నాయి. పొద్దున్నే వంటచేస్తాను. మీరు భోంచేద్దురుగాని.''

(పీతాంబరాచారి మనోమోహకంగా ఆలోచనల్లో బడిపోతున్నాడు. తేలియాడుతున్నాడు. ఓహో నా బాగ్గమే బాగ్గమూ...పొడుగ్గా నేవళంగా అందంగా ఆ ఒళ్ళూ, పొందికైన ఆ పెదవులు ... ఇక ఆలోచించలేకపోతున్నాడు.)

ఇంతకూ మీ వారి పేరు చెప్పావు కాదు – అన్నాడు చనువు తీసుకొని.

''పేరుకేం బాగ్గెం లెండి. పేరైతే దయా నందం అని పెట్టారు. బాగానే వుంది. బుద్దో, బుద్ధితక్కువ్వోడు. ఎప్పుడూ సీట్లపేక. డింకే డింకు. ఒకటే డింకు. లారీ అమ్మేశాడా ! తన వంతు మాగిలిపోయిందా. మెడకల్ సాప్‌పెట్టి దాన్ని పాడుసేసుకున్నాడా ! ఇప్పుడు తాడేపల్లిగూడెంలో సినిమాహాలు కడతాడట. నా కాసులిమ్మంటాడు.

> **రచయితలకి మనవి**
>
> ★ కాగితానికి ఒక వైపునే సిరాతో రచనలు వ్రాసి పంపవలసిందని అన్నిరకాల రచనలు పంపే రచయితలకి మరోసారి మనవి చేస్తున్నాము.
>
> ★ గేయాలు, కార్టూన్‌లు చాలా యెక్కువ సంఖ్యలో మా కార్యాలయం చేరు తూంటాయి కనుక వీటి పరిశీలన వెన్వెంటనే జరుగదు. — సం॥

నాకు పుట్టింటివాళ్ళు ఐదెకరాలు పసుపూ కుంకుం ఇచ్చారులెండి. అదీ ఇయ్యాలట. చూడండి అయ్య గారూ ! నాకో బిడ్డా, ఓ కొడుకూ ఉన్నారుకదా – ఆళ్ళేమైపోవాలండీ – బాబ్బాబు మీరు పెద్దోళ్ళు, మా బాబుని మంచి ఆట్టళ్ళో పెట్టిబాగా చదివేలా చూడండి. నా కూతుర్ని ఏలూర్లో కిస్టియన్ స్కూల్లో పెట్టా. బాబుని బెజవాడలో మిషన్ స్కూల్లోచేర్పించా. కాసులిచ్చిందాకా తనతో కాపురం చెయ్యొద్దట. ఓపాలి ఇట్టాగే ఎల్లగొట్టిండు. అప్పుడు పుట్టపర్తి వచ్చేసినా ! మళ్ళీ రెన్నెళ్ళకు వచ్చి బతిమాలి తీసుకొనిపోయిండు. ఇప్పుడుకూడా వచ్చివున్నాడేమో ఆడ.''

(పీతాంబరాచారికి దడపుట్టింది.)

దర్మవరం వచ్చింది. చెంగున బస్సు దిగి పోయింది పర్వతవర్ధని.

పీతాంబరాచారికి దుఃఖం వచ్చింది. అన్నా ఏమన్యాయం. ఇందాకటినుంచీ తన మనసులో పాములు, నక్కలు, పెద్దపులులు, ఎలుగుబంట్లు, జెర్రులు ఇంకా అసహ్యమైన క్రూరమృగాలు. ఏమిటిదంతా ? కొంచెం చనువుగా మాట్లాడిందనీ, తన కష్టసుఖాలు చెప్పుకుందనీ, గోడు వెళ్ళబోసు కుందనీనా ?

నవ్వుమొహంతో తిరిగివచ్చి ఒక యాపిల్ ముక్కా, రెండు అరటిపళ్ళూ, సగంచెక్క బత్తాయి తొనలూ, అర్ధరూపాయీ బలవంతాన చేతిలో పెట్టేసింది. వద్దంటే జబర్దస్తీగా చేయి పుచ్చుకొని లాగి చేతిలో పెట్టేట్టున్నది.

అవి తినబుద్ధి పుట్టలేదు పీతాంబరాచారికి.

తినమని బలవంతం పెడుతోంది. బస్సు కదిలింది. అప్పటికే తొమ్మిది దాటింది. మౌనంగా వుండిపోయిందా అమ్మాయి.

పీతాంబరాచారికి మనస్సంతా శూన్యమై పోయింది. చాలా అసహ్యమేస్తున్నది తనపైన తనకే. చప్పున ఒక విషయం జ్ఞప్తికి వచ్చింది. తాను ఎంతో ప్రేమించే ఎంతో గౌరవించే ఒక స్నేహితుడు చెప్పిన విషయం. కటక్‌లో తాను రిసెర్చి చేస్తున్న రోజుల్లో తెలుగు మిత్రుడే విశ్వనాథం పంతులు చెప్పిన విషయం. మనసుని అదుపులో వుంచడానికి చేయవలసిన ప్రయత్నాల గురించిన ప్రస్తావన. విశ్వనాథం అన్నాడు – నీవు ఎప్పుడైనా గుడికి వెళ్ళినప్పుడు అక్కడ అమ్మవారి ముందు నిలుచుంటావు చూడూ. అప్పుడెలాగ వుంటుంది నీ మనస్సు ? నేనోసారి మధురలో మీనాక్షి తల్లి ముందు నిలుచున్నాను. ఈ త్రిలోకీ శుకీ పంజర ఆమె. ఆ తల్లి పెదవులపై దయ. విశ్వసమ్మోహనమైన హాసం. ఆ వయ్యారపు భంగిమలో బుజంమీద విలాస శంకం. ఎందుకు చెపుతున్నానో తెలుసా ? నీ కంటికి చాలా అందమైన యువ్వనవతి, లేదా స్త్రీ కనిపించిందనుకో, ఆ చోటే దేవాలయమని మనసులోనే ఆత్మ ప్రదక్షిణ నమస్కారం చేసేయ్. నీ మనసులో చెడు తలపులు రానేరావు.

పుట్టపర్తివచ్చేసింది. అందరూ దిగారు బస్సు.

'అన్నా ! కాస్త ఈ పెట్టె సాయం పట్టవా ?' ఉలిక్కిపడ్డాడు పీతాంబరాచారి. నవ్వూ వచ్చింది. మనసులో ఆనందరేఖా మెరిసింది. ★

National

# నిప్పో సూపర్

20% ఎక్కువగా మన్నుతుంది. లీక్ అవదు. ఇది ప్రపంచ ప్రసిద్ధి చెందిన జపాన్–నేషనల్ కంపెనీ సాంకేతిక విధానంతో తయారుచేయబడింది. అత్యుత్తమంగా పని చేస్తుంది. దీర్ఘకాలం మన్నుతుంది. నాణ్యతకి సంబంధించిన ISI హెవీ డ్యూటీ చిహ్నంతోవున్న మొట్టమొదటి బ్యాటరీ నిప్పో సూపర్. ఇది ఖరీదయిన ట్రాన్సిస్టర్లకు మరియు టేప్ రికార్డర్లకు అనువైనది.






National **నిప్పో సూపర్**

**ప్రపంచ ప్రసిద్ధిచెందిన జపాన్‌లోని నేషనల్ కంపెనీ సాంకేతిక విధానంతో తయారుచేయబడింది.**

INL-2473

"బడికి వెళ్లే పిల్లల్లో పదింట ఏడుగురికి పిప్పి పళ్లున్నాయి."
—స్కూల్ సర్వే, మార్చి 1978
ఇండియన్ డెంటల్ అసోసియేషన్



పంటి నొప్పి దంత క్షయానికి సూచన. మీ నోటిలో ఉండే సూక్ష్మజీవులు ఆహారపు తునకలను హానికరమైన ఆమ్లాలుగా మారుస్తాయి. ఆ ఆమ్లాలు మీ పళ్లమీద దాడిచేసి వాటిని నొప్పి కలిగించే పిప్పి పళ్లుగా మారుస్తాయి

# వాడండి ఫ్లోరైడుగల సిగ్నల్ 2
# పిప్పిపళ్లను అరికడ్తుంది

ఫ్లోరైడ్ గల సిగ్నల్ 2 దంత క్షయాన్ని రెండు విధాలుగా అరికడుతుంది: పిప్పి పళ్లకు కారణమైన నోటి ఆమ్లాలను తయారుచేసే సూక్ష్మజీవులను విరోధిస్తుంది, పంటి ఎనామెల్‌తో కలిసి దాన్ని మరింత గట్టి పరుస్తుంది— పిప్పి పన్ను కాకుండా, మరింత బాగా విరోధించ గలిగేలా. దానికి కారణం, పిప్పి పళ్లు కాకుండా చూసే ప్రత్యేక పదార్థం ఫ్లోరైడ్, అద్వితీయమైన సిగ్నల్ సూత్రీకరణలో అత్యుత్తమంగా పనిచేయడమే.

ఇప్పుడే—మరీ ఆలశ్యం కాకుండానే—తెచ్చుకోండి సిగ్నల్ 2. అది మీ కుటుంబంలోని వారి పళ్లు పిప్పి పళ్లు కాకుండా కాపాడుతుంది.




పిప్పి పళ్లను నిరోధించడంలో మరే టూత్‌పేస్టూ దీనికి సాటిరాదు

హిందూస్థాన్ లీవర్ వారి శ్రేష్ఠ ఉత్పత్తి

LINTAS • SG2-23-2315 TE

# ఆశల అంతస్తులు



**కోరుకొండ సత్యానంద్**

జాబిల్లి తన వెన్నెల కిరణాల సోయగాలను అవనిమీద కురిపిస్తూంది.

ఆ గదిలో ఖరీదైన, అందమైన డబుల్‌కాట్ చుట్టూ అందంగా, ఆకర్షణీయంగా నేర్పుగా, ఓర్పుతో అలి నమల్లెల మాలలు తమ అసాధారణ సువాసనలను గుభాళిస్తున్నాయి. గదిలో ట్యూబ్ లైట్ల కాంతి కిటికీలోనుండి వస్తున్న చంద్రుని ప్రకృతి సిద్ధమైన తెల్లని పాలమీగడ లాంటి కాంతితో పోటీ పడుతోంది. ఖరీదైన ఆ గదిలో అన్నివైపులా ఫోమ్ సోఫాలు, నేలంతా ఆక్రమించి ఖరీదైన ఎర్రని కార్పెట్లు, వేస్ట్ జియల్ ఆర్గాన్స్‌లా తమ అవసరం లేకపోయినా మిణుకుమంటున్న డిమ్ లాంప్స్... ఇంకా ఖరీదైన అలంకరణతో ఉందా గది.

ఆ డబుల్‌కాట్ మీద ఓ యువకుడు చిరుమందహాసవదనంతో, మెరిసే కళ్ళతో, ఖరీదైన తెల్లని బట్టలతో కూర్చొని వచ్చే అతి సుందర అతివకోసం, తన జీవిత కాలంలోని అనంతకోటి క్షణాలలో అతి జాగ్రత్తగా తన గుండెలో దాచుకొని, మనస్సులో ఇముడ్చుకొని, మెదడులో పొందుపరచుకోవలసిన అతి విలువైన సుందర క్షణాలకోసం ఎదురు చూస్తున్నాడు.

అంతలో అరమోడ్పు కన్నులతో ఓ ఇంతి తలుపు చాటున నిలుచొని, వరుని వైపు అల వోకగా చూసింది.

వరుడు ఆమె చూపుకు మురిసి, ముసిగా నవ్వుకొని మెరిసే కళ్ళతో చిలిపిగా చూసి తన విశాలమైన అరచేతులతో గుండ్రటి భుజాల్ని పట్టుకొని, లాలనగా దరికి చేర్చుకొని నెమ్మదిగా, జాగ్రత్తగా నడిపించుకొని మంచం దగ్గరకు తీసుకెళ్ళాడు.

అతని చేతుల్లో ఆ అతివ మొగ్గలా ముడుచుకుపోయింది సిగ్గుతో!

వరుడు లైటార్పి ఏదో చిలిపిపని చేసాడు. వధువు అరమోడ్పు కన్నులను ప్రేమగా మూసుకుంది.

డిమ్ లైట్ల వెలుగులో ఆ నూతన వధూవరుల నీలి నీడలను, జాడలను చూస్తూ మురిసిపోతోంది పద్మ.

* * *

ఆమె గుండెలు ఎగిసి పడుతున్నాయి... ఆ నీడల్ని, జాడల్ని చూసి పరవశించిపోయి, తన కలల కడలి కెరటాల అనుభూతుల్లో మునిగి తేలుతున్న పద్మ భుజం మీద ఎవరిదో చేయిపడిన మరుక్షణంలో ఇహంలోకి వచ్చింది. తన కలలో సినిమా సెట్టు లాంటి ఆ శోభనపు గది కరిగిపోయింది... సామాన్యమైన అలంకరణతో ఉన్న నిజమైన శోభనపుగది సాక్షాత్కరించింది పద్మకు...

ఎదురుగా సూర్యం ... నవ్వుతున్నాడు పద్మంలాంటి తన భార్య పద్మను చూసి... అతనికి అంతగా అందం లేదు... అంత ఐశ్వర్యం లేదు... అతన్ని చూడగానే ఆ విషయం జ్ఞాపకం వచ్చింది పద్మకు...

కల కరిగి పోయిందని అప్పుడే తెలుసుకున్న పద్మ కొంచెం దూరంగా జరిగింది...

అతనికి అందం లేకపోయినా అభిమానం, ఆప్యాయత, అనురాగం, సంస్కారం ఉన్నాయని పద్మ గుర్తించ లేక పోయింది... అందుకే దూరంగా జరిగింది పులిని చూసిన లేడిలా, వెలుగును చూసిన చీకటిలా!

పాపం... సూర్యం అదంతా సిగ్గను కున్నాడు... పద్మ పరిమళించే మల్లెమొగ్గను కున్నాడు... కానీ అతనికేం తెలుసు? ఆమె ధనం కోసం తాపత్రయపడే పేదరికపు వలలో చిక్కుకున్న కన్నె పులి పిల్లయని!

అక్కునకు చేర్చుకున్నాడు... తన గుండెలకదుముకున్నాడు ప్రేమగా! కానీ... పద్మ ముఖం చిట్లించుకుంది... మనస్సులో తిట్టుకుంది అసహ్యంగా!

పద్మ సూర్యంలోని గుణగణాలు గ్రహించ లేక పోయినట్లే ఆమెలోని అసహ్యాన్ని, అంతర్యాన్నీ గమనించలేకపోయాడు సూర్యం!

కొంత సేపటికి ఆ గదిలో లైటారి పోయింది...

*   *   *

ఉద్యోగ రీత్యా వేరే కాపురం పెట్టారు పద్మ, సూర్యంలు...

వాళ్ళ ఇల్లు కమ్మరిల్లు కాదు గానీ, ముచ్చటైన బొమ్మరిల్లు...

పద్మ తనవైపు మెచ్చుకోలుగా చూస్తుం దనుకున్నాడు సూర్యం — గాలిలో లేని, అంతస్తు లేని తన అంతస్తును చూసి...

కానీ పద్మ గాలిలో ఊహలమేడ లల్లింది... నీటిలో కథలూహించింది...

గాలి విజృంభించింది... తద్వారా నీటిలో అలలు రేగాయి... దాంతో తనల్లుకున్న మేడలు కూలిపోయాయి, కథలు చెరిగి పోయాయి అనుకుంది...

పాపం పద్మకేం తెలుసు? గాలిలో మేడలు నిలువవని, నీటి మీది రాతలు చెరిగి పోతాయని...!

సూర్యం హాస్యానికి చక్కలిగింతలు పెట్టాడు...

నీకేమైనా వికారం పుట్టిందా? అన్నట్లు చూసింది...

అదేదో శ్రీకృష్ణుడు మీద సత్యభామ విసిరిన అలక ఓరచూపు అనుకున్నాడు...

అన్నం వదిలేసాడు... తన ఎంగిలిని అమృతంగా భావించి పద్మ పట్టించేస్తుందని ... పద్మ తినలేదు... తన ఎదురుగా తినడం సిగ్గనుకొని, తర్వాత తింటుందిలే అనుకొని బయటకు నడిచాడు...

పాపం ... సూర్యానికేం తెలుసు...? తనని దేంతో అయితే పోలుస్తుందో పద్మ, అదే కుక్క తను వదిలేసిన అన్నం తిన్నదని...!

ఏదో ఆలోచిస్తూ కిటికీ దగ్గర కూర్చున్న పద్మకు... ఎదురుగా ఓ అందమైన మేడ కన్పిస్తోంది...

ఆ మేడను తను రోజూ చూస్తుంది... ఎంత పెద్ద మేడ!? ఎంత అందంగా ఉంటుంది ...!?

రోజూ ఎప్పుడో ఒకప్పుడు ఆ కిటికీలోంచి ఒకామె కన్పిస్తుంది...

ఆమె ఎప్పుడూ తన వైపు చూడదు... ఎలా చూస్తుంది? తనామెఉన్నంత ఎత్తులో ఉంటే కదూ!?

ఎంత బాగుంటుందావిడ!? ఎంత మంచి బట్టలు కడుతుంది...? అంత పెద్ద మేడలో మహారాణిలా... ఓహ్! జీవితమంటే ఆవిడదే కదా!

అంత పెద్ద మేడ నాకూ ఉంటే!?

నేనూ...అలాగే...ఆమెలానే! అందంగా, ఆనందంగా, సుఖంగా, ఏ దిగులూ లేకుండా జీవితాన్ని దివ్య వరంలా అనుభవించొచ్చు...

ఆవిడ పేరు రేఖని..., మేడ లోపలకు వెళ్ళి చూస్తే స్వర్గంలా ఉంటుందని ... ఇంకా ఏవేవో చెప్తుంది పనిమనిషి సుబ్బమ్మ ...

---

## ఆటల వలన "చక్కెర" తగ్గుదల

తమ ఆరోగ్యాన్ని అభివృద్ధి చేసుకోదల్చిన చక్కెరవ్యాధి రోగులు ఆహార నియమాలను పాటిస్తూ రోజూ కొంతసేపు ఆటల్లో పాల్గొనాలని పశ్చిమజర్మనీ లోని సార్‌బ్రూకెన్ విశ్వవిద్యాలయానికి చెందిన ఫిజికల్ ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు ప్రొఫెసరు శ్రీ విల్‌ఫ్రెడ్ తెలియచేశారు. ఆటల వలన చక్కెర రోగుల సాధారణ ఆరోగ్యం అభివృద్ధి చెందటమే కాకుండా ఇన్సులిన్ పై ఆధారపడటం తగ్గుతుంది. ఆటలాడడంవలన అడ్రినలిన్ ఎక్కువగా వుత్పత్తి అవుతుంది. అంతేగాక ఎక్కువ 'బ్లడ్‌సుగర్' రక్తకణాలచేత మార్చబడుతుంది. అందువలన బ్లడ్‌సుగర్ తగ్గుతుంది. అడ్రినలిన్ ఎక్కువగా వుత్పత్తి అవడం వలన యిన్సులిన్ మోతాదు తగ్గించవచ్చు. ఆటల వలన చక్కెర వ్యాధి పూర్తిగా తగ్గకపోవచ్చు. కానీ, పై సత్ఫలితాలను మాత్రం యివ్వగలదు. ఈత, ఎక్కువదూరం పరుగెత్తడం, సైకిలు తొక్కడం వీరికి అత్యుత్తమమైనవి.

---

అలా చెప్తున్నప్పుడు... పద్మ తన ఊహల లోకానికి వెళ్ళిపోతుంటుంది.

*   *   *

పుల్లవిరుపు మాటలు, సూర్యాన్ని లెక్క చేయని చేష్టలు మొదలయ్యాయి పద్మలో. పాపం పద్మకేం తెలుసు? పుల్లవిరుపుమాటలు తన సంసారాన్ని విరిచేస్తాయని! కానీ, సూర్యనికి తెలుసు. అందుకే అలా జరగ కుండా చూశాడు తన ఓర్పుతో... భార్యమీద ప్రేమతో!

మధ్యాహ్నం భోజనం చేసి ఆఫీసుకి వెళ్ళి పోయాడు గుమాస్తా సూర్యం.

కాస్త రిలీఫ్ చిక్కింది పద్మకు, తన కలలలోని నీలినీలి నీడలు, ఒళ్ళు జల్లుమని పించే జాడలు చూసేందుకు.

సూర్యం ఇంట్లో ఉన్నప్పుడల్లా ఒకటే మాటలు, ఊసులు. చిన్న పిల్లాడిలా చదువు లేని కుసంస్కారిలా. పాపం పద్మకు తెలీదు. సూర్యం మాటలు అభిమానపు మాటలని, చదువులేని వారికి కూడా సంస్కారం ఉంటుందని.

గడియారం మూడు గంటలు కొట్టింది.

పద్మ కలల విహారానికి అంతరాయం కలిగింది.

కిటికీలోంచి బయటకు చూసింది పద్మ.

అద్దాలమేడ... అందమైన మేడ.. పద్మ చెవుల్లో సుబ్బమ్మ మాటలు గింగుర్లు పెడుతున్నాయి. మనసు ఆ మేడవైపుకు మళ్లింది.

స్వర్గంలాటి ఆ మేడను చూడాలన్పించింది. బలమైన ఆ కోరిక పద్మను ఆ మేడ వైపు నడిపించింది.

పద్మ బయటనున్న కాలింగ్‌బెల్ నొక్కింది.

గోడలు పాలరాతిలా సాపుగా, శుభ్రంగా, చల్లగా, తెల్లగా ఉన్నాయి.

కొన్నిక్షణాల్లో తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా అజంతా శిల్పంలాంటి మనిషి. కళ్ళు జిగేల్ మన్నాయి పద్మకు. ముక్కుపుటా లదిరేలా గుప్పున సెంటు వాసన తగిలింది.

"రండి" అని ఆమెలోపలకు దారితీసింది.

ఆమె వెంట పద్మకూడా దారితీసింది.

సుబ్బమ్మ 'సొర్గం నాగుంటాదమ్మా!' అన్న మాట జ్ఞాపకం వచ్చి "స్వర్గంలాగ ఏమిటి, స్వర్గమే" అనుకుంది...

నేలంతా కార్పెట్లు, సోఫాసెట్లు, రేడియోగ్రాం, ఇంతా అందమైన

## ఆశల అంతస్తులు

కర్టెన్లు వెంటిలేటర్లందు అందమైన రంగుటద్దాలు, ఓ మూలపుస్తకాల అందంగా అమర్చబడ్డ బుక్ కేస్... ఇంకా తనకు పేరే తెలియని ఎన్నో వస్తువులున్నాయి...

అవన్నీ చూసిన పద్మకు చెమటలు పట్టేసాయి...

రేఖ ఎయిర్ కూలర్ ఆన్ చేసింది... చల్లని గాలి పద్మ చెక్కిళ్ళను తాకింది... ఒక్కసారి ఒళ్ళంతా పులకరించింది... తన ఊహల భవనం కనిపించింది ...

"ఆఁ... మీ వారేం చేస్తున్నారు... ?" అని అడిగిందామె...

పద్మ గుండె గతుక్కుమంది... ఏం చెప్తుంది? తలెత్తుకొని దర్జాగా చెప్పడానికి తన భర్త ఏమైనా పెద ఆఫీసరా? కానీ... చెప్పక తప్పలేదు...

"పోర్టులో పనిచేస్తున్నారు..."

"పోర్టులో అంటే... ఏం చేస్తున్నారు... ?"

"... ఎల్.డి.సి..." ఆ జవాబులో పద్మ ఫీలైన 'షై'ని స్పష్టంగా గుర్తించిందామె...

"ఓహో అలానా? మా వారు పోర్టులో పెద్ద ఆఫీసర్! మూడు వేల చిల్లర జీతం... అతని కింద చాలా మంది ఎల్.డి.సీలు పనిచేస్తారు..." అంది.

ఆ మాటలో గొప్ప పొంగి ఉంది... ఆమె పలికే ప్రతి పలుకులో గర్వం తొంగి చూస్తుంది... పద్మకు తల తీసుకెళ్ళి రైలు పట్టాల కింద పెట్టేయాలనిపించింది ఆక్షణంలో!

ఆమె దగ్గర తానొక పూచిక పుల్లలా ఊహించుకుంది...

ఆమె ఇల్లంతా చూపించింది... ఒక గదిని మించింది మరొకటి... రేఖ గర్వంగా చూసిందొకసారి పద్మవైపు, ఇల్లంతా ఓసారి చూపించి... ఆ చూపు నుండి తప్పించుకోడానికి శతవిధాల ప్రయత్నించింది పద్మ...

వాళ్ళ కుక్ కాఫీ తెచ్చి అందించాడు పద్మకు, రేఖకు...

ఆ గదిలో తను చూసిన రేఖ బట్టలే కప్పిస్తున్నాయి పద్మకు... తనిప్పుడు కట్టుకున్న చీర తనకున్న చీరలన్నింటి కంటె విలువైనది... ఆ చీర రేఖ ఇంటి దగ్గర

కట్టుకున్న చీర దగ్గర వెంటాడి పోతోంది...

'కాఫీ తాగండి...'' అన్న రేఖ మాటతో ఈ లోకంలోకి వచ్చింది పద్మ...

పద్మ తాగడం మొదలు పెట్టింది...

రేఖ మాట్లాడుతోంది...

''నాకు బ్రూకాఫీ అంటే ఇష్టముండదు. నేనెప్పుడూ బోర్నవిటా, బూస్ట్, వివా, హార్లిక్స్ ఇలాంటివే తాగుతాను ఎవరైనా మీలాంటి అతిథులొచ్చినప్పుడే కాఫీ చేయిస్తాను. మాకయే ఈ కాఫీల ఖర్చు ఒక ఎల్డీసీ జీతం అంత ఔతుంది. ఏం చేస్తాం. అయ్యే ఖర్చును ఆపగలమా? చాలా మంది లోక్లాస్ పీపుల్ వెధవలు అణాపరక టీలు తాగుతారు ఆ మాట వింటేనే నాకు డోకు సుమండీ!'' ముఖం వెగటుగా పెట్టి అందామె.

ఇచ్చిన కాఫీ ముఖాన కొట్టినట్లయ్యింది. తను రోజూ టీయే తాగుతుంది. తన మొగుడు ఆ టీపొడి తీసుకు వచ్చేందుకే పెద్ద యుద్ధమే చేస్తాడు —అనుకుంది పద్మ.

మరికొంతసేపు అలాగే ఆమె చెప్తున్న మాటలు వింటూ కూర్చుంది పద్మ.

ఆమె మాట్లాడే ప్రతి మాటా బల్లెల్లా గుచ్చుకుంటున్నాయి.

గుండెనుపిండి రక్తం తాగినంత బాధను కల్గిస్తున్నాయి.

రేఖ పలికే ప్రతి పదంలో ధన మదం, గర్వం, ఎదుటి వారిపై చులకన భావన పొంగి పొరలుతున్నాయి. ఇక్కడి కెందు కొచ్చానా? అనుకుంది పద్మ.

కన్నీళ్ళ పర్యంతం అయ్యింది. ''వెళ్ళొస్తా నండి'' అని చెప్పి లేచింది పద్మ.

''అలాగే! కొంచెం గేటు తలుపు వేసి వెళ్ళిపోండి'' అని చెప్పి ఏదో పుస్తకం పట్టుకుంది రేఖ.

ఇంటికెళ్ళి సూర్యం కొన్న మామూలు పట్టెమంచం మీద వాలిపోయింది. ఆమె చూపు శూన్యంలోకి... ఆ శూన్యంలో ఆ మేడ...

ఎంత బాగుందా మేడ? ఆమె కూడా చాలా అందంగా ఉంది. కాని ఆమె మాటలు? మనస్సులోకి సూటిగా దూసుకు పోయాయి. ఎదుటి మనిషిని కుక్కకన్నా హీనంగా చూసి మాట్లాడటమా? మరీ అంత గర్వమా? ఎప్పుడైనా అంటే తనే ఒకళ్లని అంది గానీ, తననెవ్వరూ ఇంతలా అవమానించలేదు.

అది తన తప్పా? ఆడదానివిలువ పెరిగేది, ఆడది సుఖపడేదీ అది కట్టుకున్న భర్తమీద ఆధారపడి ఉంటుంది. ఆ భర్తే ఎందుకూ కొరగాని హీనుడైతే... ఆ ఆడదాని జీవితం ఏముంది? పట్టె నరకం.

ఆ నరకం నా జీవితాన్ని పెనవేసుకుంది. విడిపించుకోలేని బంధమై కూర్చుంది... పద్మలో ఆ బాధ గుండెను నలిపేస్తోంది...

ఆమె మాటలు గుర్తొచ్చినప్పుడల్లా పద్మకు సూర్యం మీద కోపం ముంచుకొస్తోంది. 'ఎంత అసమర్థుడు తన భర్త?' అనుకుంటుంది.

పాపం పద్మకు తెలీదు ... సూర్యం ఎంత ఓర్పుగలవాడో!

అంతలో సూర్యం వచ్చాడు ... భార్య కోసం చుట్టూ వెతికాడు ... మంచం మీద బోర్లా పడుకొని ఉంది పద్మ ... తన ఉనికిని గుర్తించ లేదనుకొని ఆమె ప్రక్కనకూర్చొని లాలనగా తనవైపు తిప్పుకున్నాడు. ఆమె ముఖం చూసి ఆశ్చర్యపోయాడు.

ఆమె ముఖమంతా చెమటతో తడిసి కళ్లు బాగా ఎర్రబడి ఉన్నాయి

చెంపల మీద కన్నీటి చారలు...ముఖంలో విషాద ఛాయలు...

''పద్మా! ఏమయ్యింది? ఎందుకేడుస్తున్నావ్?...చెప్పు'' ఆతృతగా అడిగాడు.

అతనలా అడుగుతుంటే పద్మకు కోపం పెను తుఫానయ్యింది...''మీ అసమర్థత చూసి ఏడవకపోతే నవ్వమంటారా?'' విచక్షణ లేకుండా తీక్షణంగా అంది.

ఆ మాటకు షాక్ తిన్నట్లయ్యింది సూర్యానికి...

''ఏమిటి పద్మా! నువ్వేం మాట్లాడుతున్నావ్? ఎందుకలా అంటున్నావ్.. నాకేం అర్థంకావడంలేదు...'' అన్నాడు

''అయ్యోపాపం ఎందుకర్థమౌతుంది...? అనుభవించేవాళ్లకు గానీ అర్థం కాదు ఈ బాధ!'' నొక్కి నొక్కి అంది.

''పద్మా! ఏమిటో సూటిగా చెప్పు! నాలో అసమర్థత నీకేం కన్పించింది...అసలీ అసమర్థాల, సమర్థాల విషయం ఎందుకు వచ్చింది...?'' కాస్త కరకుగానే అంది.

పద్మ బెదరలేదు...ఆగలేదు...

''కాకపోతే పెద్ద సమర్థులా? బోడి గుమాస్తా ఉద్యోగం పెట్టుకొని పెద్ద ఆఫీసర్లా ఫీలైపోతున్నారు!'' తొణక్కుండా అనేసింది.

సూర్యం ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆ మాట సూటిగా అతని మనసుకు గుచ్చు



కుంది. ఒక నిముషానికి గానీ తేరుకోలేక పోయాడు.

తేరుకొని పద్మ వైపు సూటిగా చూసాడు. పద్మ గిరుక్కున ముఖంతిప్పేసుకుంది.

''పద్మా! అదా నాలో ఉన్న అసమర్థత. నేనే ఎప్పుడూ గుర్తించని విషయాన్ని నువ్వు బాగా గుర్తించావే! ఔను నేను గుమాస్తానే! ఆ ఉద్యోగమే నా పాలిట వరమనుకొని పొంగి పోతున్న అసమర్థుణ్ని కానీ పద్మా! పెళ్ళికి ముందు నాది పెద్ద ఆఫీసరుద్యోగం అని నీతో చెప్పలేదే... అయినా ఇప్పుడు నీకేం లోటు వచ్చిందని అలా అంటున్నావు...?'' అన్నాడు సూర్యం.

'అబ్బో! లోటేమీ రాలేదట...ఎవరైనా వస్తే కూర్చోడానికి నాలుక్కుర్చీలు, ఓ సోఫా, ఫ్యాను, రేడియో అసలిలాంటి కనీసపు వస్తువులైనా ఉన్నాయా? మీ వల్లగా నేను అవమాన పడాల్సొచ్చింది...!'' అంది కసిగా...

''ఏమిటి పద్మా, నిన్నెవరు అవమాన పర్చారు? చెప్పు!''

''ఇంకెవరు...? మీ లాంటి గుమాస్తాలు వంద మంది ఎవరి కిందైతే పనిచేస్తారో ఆతని సతీమణి రేఖ! ఎదురింటి పెద్ద మేడావిడ'' అంది దెప్పిపొడుపుగా...

ఆ మాటకు సూర్యం మనసు చివుక్కుమంది... కానీ ఆశ్చర్యంతో...'' ఎవరు...? ఎదురింటి మేడవాళ్ళా?'' అని అడిగాడు... ఔనన్నట్టు తలూపింది పద్మ...

## ఆశల అంతస్తులు

సూర్యం గట్టిగా నవ్వాడు పద్మ వైపు చూస్తూ...

సూర్యం ఎందుకు నవ్వుతున్నాడో తెలియక తికమక పడింది పద్మ...

సూర్యం నవ్వాపుకొని...'' పద్మా! ఆయన నిజంగా పోరులో ఆఫీసరు కాదు పద్మా! నాలాంటి గుమాస్తాయే! కాకపోతే తాతలు, తండ్రులు గడించిన ఆస్తి ఉంది కాబట్టి అంత దర్జాగా ఉంటున్నారు...పద్మా నీకు తెలియక ఆవిడ చెప్పిన మాటలు నమ్మేసావ్!''

ఆ మాటకు పద్మ ఆశ్చర్యంగా చూసింది సూర్యం వైపు...

'పద్మా! మనకు ఆస్తి లేదనేగా నీబాధ... ఉండు పద్మా నెమ్మది నెమ్మదిగా అన్నీ అమర్చుకోవచ్చు... ఆస్తి గడించుకోవచ్చు... అయినా మనుషుల్ని కలిపేది ధనం కాదు... మంచి మనసు... ఉన్నదాంట్లోనే సర్దుకొని గడపడంలో ఉన్న తృప్తి మరి దేనిలోనూ లేదు పద్మా!... నువ్వువాళ్ళింటికెళ్ళావా పద్మా!'' అనడిగాడు సూర్యం...

ఔనన్నట్టు తలూపింది...

''ఎందుకెళ్ళావ్ పద్మా! అలాంటి డబ్బు మనుష్యుల దగ్గరకెందుకెళ్ళావ్? డబ్బును చూసి వాళ్ళ కళ్ళు నెత్తికెక్కాయి... ఆ కళ్ళకు నైతిక విలువలు కన్పించడం లేదు... ఒక నిజం చెప్పమంటావా? వాళ్ళు డబ్బును చూసి మనుష్యులకు విలువనిస్తారు... మనం ఉన్నదాంట్లో ఆకలి లేకుండా దర్జాగా, గుట్టుగా సంసారాన్ని ఈడుస్తున్నాం... మరి వాళ్ళు? ఎదుటి వాళ్ళకు తమ దర్జాల్ని చూపించి, వాళ్ళను అవమానపరచి తృప్తి పడుతుంటారు... నువ్వు నీ కంటే పైవాళ్ళను చూస్తున్నావ్ పద్మా! పై వాళ్ళకు ప్రేమాభిమానాలు, ఆత్మాభిమానాలు ఉండవు వీళ్ళు ఒకర్ని ప్రేమించరు. డబ్బుకోసం ఆత్మాభిమానాన్ని చంపుకుంటారు వాళ్ళ దగ్గరకు చేరుదాం అంటున్నావా పద్మా! చేరుదాం, సరే, అది ఏమంత కష్టం కాదు. కానీ, ఆడ్డమైన గడ్డి కరవాలి కొంతమంది కింద లొంగుగా తిరగాలి. ఆత్మాభిమానాన్ని హత్య చేసేయాలి.

ఆత్మాభిమానం లేని మనిషి మనిషికాదు పద్మా! ఆత్మాభిమానం సూర్యకాంతి లాంటిది చంద్రుని వెన్నెల లాంటిది. అది వేడిగా వుంటుంది గానీ భరిస్తే అది వెన్నెలంత చల్లగా, హాయిగా వుంటుంది సూర్యునికి ఆ వేడి, చంద్రునికి ఆ చల్లని వెన్నెల లేకపోతే సూర్యుడు సూర్యుడూ కాదు, చంద్రుడు చంద్రుడూ కాదు అలాగే ఆత్మాభిమానం లేకపోతే ఎవరూ మనిషనిపించుకోరు. నీకంటె పైవాళ్ళను కాదు పద్మా, క్రింది వాళ్ళను చూడు! వాళ్ళకున్న ఆదరాభిమానాలు, నిష్కల్మషమైన మనస్సూ ఎవరకూ ఉండవు. ఉదాహరణకు మన పని మనిషి సుబ్బమ్మను చూడు, దాని మొగుడు ఓ ప్రైవేటు ఆఫీసులో ప్యూను. నూటయాభై రూపాయలు జీతం. వాడు తెచ్చిన జీతం చాలకే గదా, అది మన్నాటి వాళ్ళిళ్ళలో అంట్లు తోముతోంది. కానీ అది మొగుణ్ని ఎంత ప్రేమగా చూస్తోంది...?''

ఒకరోజు సూర్యం, పద్మ పిక్చరుకు వెళ్తుంటే సుబ్బమ్మ ఎదురైంది. ఎంతో 'ఇది'గా ''రండమ్మా, మా యిల్లు యిక్కడే. మా యింటాడు కూడా యింటి పట్టునే వున్నాడు... మా యిల్లు సూద్దురుగాని...'' అంటూ ఎంతో అభిమానంతో పిలిచింది. పద్మకు ఇష్టం లేకపోయినా సూర్యం బలవంతంమీద వెళ్ళింది.

రాజుగారు తమ ఇంటికే వచ్చే భటుడు ఎంత ఇదైపోతాడో అంతలా పొంగిపోయారు సుబ్బమ్మ, ఆమె మొగుడు.



ఆ 'ఇది' డబ్బున్న వాళ్ళల్లో వుండదని అప్పుడు సూర్యానికే తెలుసు.

గబగబా మలకమంచం వేసింది దానిమీద పెట్టెలోంచి తీసిన క్రొత్త దుప్పటపరచింది పండుగరోజు నాటి సంతోషంతో.

"కూర్చోండి బాబూ! మా కింతకంటే నేదు" అని చెప్పి పద్మను, సూర్యాన్నికూర్చో బెట్టింది.

ఆ మాటల్లో సిగ్గు లేకపోగా ఆత్మగౌరవం, అభిమానం, ప్రేమ కన్పించాయి...

గబ గబా హోటలుకువెళ్ళి 'టీ' తెచ్చింది. ఆ టీ బాగాలేదు. కానీ సుబ్బమ్మ అభిమానం దగ్గర అది చాలా రుచిగా అన్పించింది సూర్యానికి.

అదంతా గుర్తుకొచ్చింది సూర్యం మాటలతో పద్మకు.

రేఖ, సుబ్బమ్మ ఇద్దరూ పద్మ కళ్ళ ముందు నిలిచారు. ఇద్దరి మాట తీరు, అభిమానం ... కన్పించాయి... ఆమెలో ఏదో తెరలు తొలగినట్లయ్యింది.

ఇపుడు పద్మకు సుబ్బమ్మ అనురాగం ఎంతో ఆనందాన్నిచ్చింది. సుబ్బమ్మ 'టీ' నోరూరిస్తోంది.

పద్మకు గాఢ సుషుప్తిలోంచి తేరుకున్నట్లుయ్యింది.

"నన్ను క్షమించండి!" అంటూ ప్రేమగా, మొట్టమొదటిసారిగా సూర్యం కౌగిట్లో ఒరిగిపోయింది పద్మ.

"తప్పు పద్మా! ఆలుమగల మధ్య ఆనందానుభూతులే గానీ క్షమాపణలుండ కూడదు." అని వారించాడు, పద్మను ప్రేమగా నిమురుతూ.

పద్మ అల్లిన గాలిలోని 'ఆశల అంతస్తులు' కూలిపోయాయి. ఇప్పుడు ఆమె మనసు ప్రశాంతంగా ఉంది ... వర్తమానం స్వర్గ సీమలా కన్పించింది.

భాముడు నవ్వుతూ పడమట కాంతల ఒడిలో వాలిపోయాడు.

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.





# ★ వారఫలం ★

**28-8-1981 శుక్రవారం మొదలు 3-9-1981 గురువారం వరకు**

మేషం:—'యత్నేఫలీ' అను న్యాయమున్నది. ప్రయత్నంచేత మీర సాధించలేని కార్యము లేదని తెలిసికోగలరు. ఆరోగ్యలోపముండదు. ఆదాయంలో అభివృద్ధిగలదు. స్త్రీలకు : ఉన్నత విద్యార్జ నావకాశాలు, ధనాదాయం, క్రీడా రంగంలో అభివృద్ధికరమైన మార్పుల కాశం గలవారం.

వృషభం:—గత కొన్ని వారాలకన్నా, అన్ని విధాలా బాగున్నవారమని ఎన్నిక చేయనున్నారు. అప్రయత్నంగా ధనరాబడికితోడ కొన్ని కార్యములు నెరవేర్చుకో గలుగుతార. గమనించండి. స్త్రీలక : సంతాన విషయకంగా ఆనందం, ఆదాయం, ఉద్యోగంలో వృద్ధి చెప్పదగినవారం.

మిధునం:—స్వకార్యం, పరుల కార్యాలు నెరవేర్చేందుకు ప్రయత్నిస్తారు. సంఘంలో పేరు ప్రతిష్టలకు అవకాశమున్నది. పరుల చిత్తవృత్తి నెరిగి, మీకు లాభించినా లేకున్నా, వారికి సహాయపడనున్నారు. వ్యాపార లోపంలేదు. వ్యవహారమందు అనుకూలతగలదు. స్త్రీలకు : నూతన వస్తుసేకరణకు, క్రొత్త విషయాలు తెలిసికొనుటకు వీలున్నది.

కర్కాటకం:—రచయితలకు, కథకులకు, రంగస్థల, చిత్రరంగ నటులకు, వైద్య వృత్తియందున్న వారికి, నగల వర్తకులకు మంచి అవకాశాలు. ధనాదాయం, పెద్దల అభిమానంచెప్పదగిన వారం. స్త్రీలకు : వస్తు సేకరణకు, దూర ప్రయాణం గావించుటకు అనుకూలసమయం.

సింహం:—చేసిన పనే మరల చేయవలసి రావటం, ఆదాయం కొరకు యత్నించటమేగాని, అది అందక పోవటం, సహాయ పడగలమన్న వారు చేయివదలటం, ఇత్యాది విషయాలుగమనించగలరు. స్త్రీలకు : వస్తు సేకరణ యందును, వ్యాపారం సాగించుటకు, శుభ కార్యాచరణకు, నూతనోద్యోగ ప్రయత్నాలకు అనుకూల కాలం.

కన్య:— మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతనోద్యోగం హాయిగా ఉన్నదని, ఏదో ఆదాయం లభించనున్నదని గ్రహించగలరు. నూతన విషయాలు తెలిసికోవటం, నూతన వస్తుసేకరణ, వలసిన ద్రవ్యం లభించటం, గమనించనున్నారు. స్త్రీలకు : వస్తు వాహన సంపాదనకు, ఇతరులకు సహాయపడుటకు, ధర్మ కార్యాచరణమునకు అనుకూల వారం.

తుల:— ఏమంత మంచివారంగాదు. ముందు వెనుక లాలోచించిగాని కార్యరంగానికి దిగరాదు. బార ముందుకెళ్లి మూరెడు తగ్గరాదు. వ్యాపారం సాఫీగా సాగే అవకాశం, నూతనవ్యవహారం గ్రహించటం జరుగుతుంది. స్త్రీలకు : సాహిత్య రంగాలలో అవకాశాలుండగలవు.

వృశ్చికం:— ఆరోగ్యం బాగుండేవారంగాన, విజృంభించి, స్వకార్య నిర్వహణకు పూనుకోండి. జాయింటు వ్యాపారం బాగా సాగిపోయే మార్గమున్నది. మిత్రవర్గీయులు, క్రయ విక్రయాలలో మీకు సహాయ పడనున్నారు. కొత్తవస్తువుల కొనుగోలు చేయగలరు. స్త్రీలకు : అప్రయత్నాదాయం, సంతానాన్నిగూర్చిన ఆనందం సంభవం.

ధనుస్సు:—వ్యాపారం సామాన్యంగ సాగిపోతుంది. రాజకీయవాదులకు అనుకూల పరిస్థితులుండగలవు. క్రీడారంగంలో చాలమందికి ఆదరణ లభించనున్నది. సమయానికి పైకం అందుతుందనుకోరాదు. చిక్కులనేకంగా వెంటబడుతాయి. స్త్రీలకు : కుటుంబ చిక్కులు చేసే పనులకు ఆటంకాలు, బంధువుల మూలాన ఇబ్బందులుండగలవు.

మకరం:—మీ ప్రతి చర్యను విమర్శించే వారుంటారు. మీ మాటను లెక్క చేయక వాదోపవాదాలకు దించే బంధువులు, మిత్రులుంటారు. మాటకు విలువతగ్గే ప్రయత్నాలుండగలవు. అయినదానికి కానిదానికీ పోరాటం మానుకోవలసి ఉంటుంది. స్త్రీలకు : క్రమంగా ఆదాయంవృద్ధి, నగలు కొనుగోల చేయటం సంభవమే.

కుంభం:—దూర బంధువులను గూర్చిన దు:ఖకరమైన వార్త వినవచ్చు. కష్టమని ఎంత పనికైనా వెనుదీయరు. ఇబ్బందులు కలిగించే పరిస్థితులుంటాయి. కించిత్తు ఆదాయం చెప్పవచ్చు. వైద్యులకు ప్రకాశవంతమైన వారం. స్త్రీలకు : చిక్కులు, క్రయ విక్రయాలలో నష్టం, రచనా విధానంలో ఆశాభంగం సంభవం.

మీనం:— దూర దేశాల నుండి, ఏవో ఆనందకరమైన వార్తలందనున్నాయి. బంధు విరోధం రాకుండా చూచుకోవాలి. శుభకార్యాచరణకు, దైవ కార్యానుకూలతకు అనుకూల కాలంగా గుర్తుంచుకోండి. మీకు దొంగభయంగా వస్తువులు పోగొట్టుకునే అవకాశంగాని ఉన్నదనుటలో ఆక్షేపణలేదు. స్త్రీలకు : విద్యాయోగ్యతా ప్రకాశిక, క్రీడారంగంలో అనుకూలతకు దోహదం చేసే వారంగా గ్రహించండి.

**– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**


Super
Dust




HTC-BBI-3986

# గ్యాస్ ట్రబుల్ రోగులు, చదివి, అర్థము చేసుకొని, ఆలోచించండి

మీరు ఇప్పుడు ఏదైనా వ్యాధి నుంచి బాధ పడుతుంటే, దయచేసి ఈ క్రింద తెల్పిన గ్యాస్ ట్రబుల్ లక్షణాలకు మీరు బాధపడుతున్న వ్యాధి లక్షణాలకు సంబంధం ఉందేమో పోల్చి చూసుకోండి. మీ సమస్యకుకూడా గ్యాస్ ట్రబుల్ కారణమని మీకు నమ్మకం కలిగితే, మరేం భయ పడవలసిన అవసరంలేదు. మీ పరిస్థితినిగురించి గాబరాపడవద్దు, నిరాశ చెందవద్దు దయచేసి "గ్యాస్ట్రో"ను వాడి, మీ బాధలనుండి త్వరితంగా పూర్తిగా విముక్తి పొందండి. శారీర కంగాను, మానసికంగాను జీవితంలో వీలైనంత ఎక్కువ సుఖం, వీలైనంత ఎక్కువ కాలం అనుభవించాలనే వాంఛ వుండటం మానవసహజం. అందుకే ఈ సలహా.

గ్యాస్ ట్రబుల్ అని సాధారణంగా అందరికీ తెలిసిన వ్యాధి నుంచి బాధపడుతున్న వారిలో చాలా మందికి, ఈ వ్యాధికిగల రెండు ముఖ్య అంశాలు తెలియవు. గ్యాస్ మూలంగా అనేక ఇతరవ్యాధులు సంక్రమిస్తుంటాయనే విషయం వారికి తెలియదు. ఈ జబ్బును ఏం చేసి కుదుర్చుకోవాలో కూడా తెలియదు. అందు వల్ల అలాంటి వారు తగిన ఆహారం భుజించక చాలా బాధతో, విశ్రాంతి లేని జీవితాలు గడుపు తుంటారు. క్రమంగా అలాంటివారు అనారోగ్య మనే లోతైన గుంటలో పడిపోతారు. అలాంటి వారివి ఈ వ్యాధికి సంబంధించిన ప్రధాన వివరాలుగల ఈ క్రింది విషయం చదవాలని కోరుతున్నాము. దీనివల్ల వారికి ఎంతో ప్రయో జనం ఉంటుంది.

"జఠరాగ్ని అనగా జీర్ణశక్తి తగ్గిపోయి నప్పుడు, మనం తినే ఆహారం సరిగా సకా లంలో జీర్ణం కాదు. అలా జీర్ణం అయినా కాని ఆహారం కడుపులో పులిసిపోయి,తప్పుడు గ్యాసులు ఉత్పత్తి చేస్తుంది. ఈ తప్పుడు గ్యాసుల వల్ల త్రేపులు వస్తాయి. గుండెనొప్పి, తదితర తీవ్ర బాధలు కల్గుతాయి. గ్యాస్ ట్రబుల్ ప్రధాన లక్షణాలివే. శరీరానికి ఎండ వేడిమి, అగ్ని వేడిమి సోకినా లేక తంబాకు నములడం, పొగ పీల్చడం వంటి పనులు చేసినా, మిరప కాయలు,ఇంగువ, చింతపండు, ఉల్లిపాయలు, సారా. తేయాకు, కాఫీ, మజ్జిగ, పెరుగు, దుంప కూరలు, ఎండు చేపలు మొ. వాటిని మనిషి శరీర స్థితిని నిర్ల క్ష్యం చేసి తినినా, కడుపులో పైత్య రసం అతిగా ఉత్పత్తి అవుతుంది. ఈ రసం పై పొత్తి కడుపులోను, గుండెలోను,బాధ, మంట పుట్టిస్తుంది. కడుపులో ఆహారం పులియడం వల్ల పుల్లత్రేపులు రావడం, ఆహారం జీర్ణం కాని రుచి, పేదు వగైరాలు ఉంటాయి. పై పొత్తి కడుపులో ఈ గ్యాస్ నిలిచిపోయి చలి, జ్వరం, మత్తుగాఉండటం వంటివికలుగుతా యి. క్షీణించి పోయిన పైత్య రసం ప్రేగులలో ప్రవేశిస్తుంది. ఇది విద్యుచ్ఛక్తి వలె ప్రయాణించే గ్యాస్‌ను ఉత్పత్తిచేస్తుంది. ఈ గ్యాస్ మెదడుకు గుండెకు, హృదయ కోశానికి విద్యుత్ వేగంతో వ్యాపిస్తే రోగి మత్తుగా స్పృహ కోల్పోయినట్లుగా గుండె చుట్టూనొప్పి ఉన్నట్లుగా ఫీలవుతాడు. ప్రేగు లలో పేరుకుపోయిన మలం, గ్యాస్ ఒత్తిడివల్ల వేడెక్కి, గ్యాస్ ప్రేగులగుండా ప్రయాణించ డంతో పైకంగా ఉండడం, స్పృహ కోల్పోవడం, గుండెనొప్పి, ఇతర పరిస్థితులు ఏర్పడతాయి. వీటినన్నింటినీ సమష్టిగా కలిపి "గ్యాస్ ట్రబుల్ అంటున్నారు.

## గ్యాస్ ట్రబుల్ మూలంగా ఇతర చిక్కులు

పొత్తి కడుపులో తప్పుడు గ్యాసులు అతిగా ఉత్పత్తి కావడం వల్ల, తేలికగా ఆహారం తీసుకున్నా కడుపు ఉబ్బరంగా ఉన్నట్లు ఫీలవు తాము. కడుపులోని వివిధ భాగాల నుంచి చిన్న శబ్దాలు, పెద్ద శబ్దాలు, కడుపులో మంట, కడు పులో నీరు కలిగిన ఫీలింగ్, గుండె మంట,గొంతు మంట, గ్యాస్ శబ్దం చేస్తూ పైకి కిందికి సంచలనం,కఫం పడటం తరచుగా మల విసర్జనకు పోయే ధోరణి, గుదములో మంట, తరచు మూత్ర విసర్జన, తరచుగా తినాలనే ధోరణి పుష్టికరమైన ఆహారం తీసుకున్నా శారీరక బల హీనత, ఆకలి లేకపోవడం, అతిగా ఆకలి వేయడం, దగ్గు, వాంతులు, మొదలైనవి సంభవిస్తాయి. కడుపులో గుచ్చినట్లు బాధ, చీమలు ఇతర క్రిములు కుట్టిన ఫీలింగ్, గుండెలో తేలికగా ఉన్న భావన, గుండె కొట్టుకోవడం ఎక్కువ కావడం, కష్టించి పని చేసిన తర్వాత కడుపులో గ్యాస్ పేరుకుని పోవడం, మత్తుగా ఉండటం, తలలోని వివిధ భాగాలలో తీవ్ర నొప్పి, కంటి చూపు లోపించడం, కళ్ళ మంటలు, కళ్ల వెంట నీరు కారడం, సరిగా వినపడకపోవడం, చెవులు దిబ్బళ్ళ పడటం, చెడు కలలు [ఉదర కోశంలో గ్యాస్‌తో బాధపడే చాలా మంది రోగులు చెడు కలలతో నిద్రిస్తుంటారని అనేక మంది అనుభవంవల్లతెలుస్తున్నది] శబ్దంపట్ల అసహనభావం, ఎప్పుడూ పడుకొని ఉండాలనే వాంఛ, నడిచేటప్పుడు గుండె త్వరగా కొట్టు కోవడం, గొంతులో కళ్లె, నోట్లో ఉమ్మి ఊరటం, నాలికమీద పాచి, నోట్లో దుర్వాసన, నిద్ర లేకపోవడం, తలనొప్పి, బలుబలి, అజీర్తి కీళ్ళనొప్పులు, అతి దాహం, రక్తం లేకపోవడం, పనిపట్ల అనాసక్తి, ఆలోచనా శక్తి లోపం, ఒంటరిగా ఉండాలనే వాంఛ, జ్ఞాపకశక్తి లేక పోవడం, దృఢ నిశ్చయం లేకపోవడం, కోర్కెలను అణచుకొనే శక్తి లేకపోవడం ముక్కుమీదకోపం ఇలాంటి దుఃఖభాజనకమైన లక్షణాలతో బాధపడుతున్నవారు అసంఖ్యాకంగా ఉన్నారు.ఈ లక్షణాలుఒకటొకటిగా ఉండవచ్చు. లేక కలసి ఉండవచ్చు. ఖయంగా ఉండవచ్చు లేక తాత్కాలికంగా ఉండవచ్చు. ఆయుర్వేద శాస్త్రంప్రకారం, అన్ని రోగాలు త్రిదోషాలు [వాతం, పిత్తం, కఫం]తో వత్యాసం వల్ల సంభవిస్తుంటాయి. వాటిలోమొదటిది అనగా వాతం చాలా ముఖ్యమైనది.ఈ దోషానికి గ్యాస్ పేరుకోడానికి సంబంధం ఉంది. ఒటుంకపరచ బడిన గ్యాసు శరీరం నుండి ఏ మార్గం ద్వారా వదిలేసినా రోగి ఎంతో హాయిగా ఫీలవు తాడు. పొత్తి కడుపులో అతిగా గ్యాస్ పేరుకుని పోవడం, అది బైటికి పోకుండా ఒటుంకం ఏర్ప డటం అన్ని లక్షణాలకు మూల కారణమని స్పష్టమవుతున్నది.

## "గ్యాస్ట్రో"

ఒకే రకపు జబ్బులకు ఒకే రకపు చికిత్స లున్నాయి. కొన్ని రోగాలకు అనేక చికిత్సలు కలిపి చేస్తేనే కాని అవి కుదరవు. అనేక వ్యాధులుచేరితే కొన్ని ప్రత్యేక చికిత్సలున్నాయి. గ్యాసువల్ల కలిగే అన్ని రకాల రోగాలకు, లక్షణాలకు "గ్యాస్ట్రో" ప్రత్యేక చికిత్స. శరీరానికి అవసరమైన వాత, పిత్త, కఫం వంటి ప్రధాన శక్తులు పెరిగినా, తరిగినా, వ్యాధులు సంక్రమిస్తుంటాయని తెలుసుకోలేని వారు ఒకే ఔషధం అనేక రోగాలను కుదర్చకలదని నమ్మడం కష్టమవుతుంది. ఇందుకు వారిని నిందించరాదు. వారిలో దోషం లేదు. అలాంటి వారికి "గ్యాస్ట్రో" వాడి చూసి, సంతృప్తి చెందుతారో లేదో పరీక్షించు కోమని సలహా ఇవ్వాలి. నీవు గ్యాస్ట్రిక్ రోగివైతే, అది చికిత్స లేని రోగమని మాత్రం భయ పడవద్దు. వాస్తవానికి ఈ నమ్మకానికి సంబంధం లేదు. "గ్యాస్ట్రో" దీనికి ఉదాహరణ. నీ ఆరోగ్యంలో ప్రతిఘటన శక్తులున్నాయని నీకు తెలినట్లే "గ్యాస్ట్రో"లో గ్యాస్ట్రిక్ రోగా లను, అనుబంధ వ్యాధులను కుదర్చగల శక్తి,

# ప్రశ్నావళి

—కె. రామలక్ష్మి

**డి. వి. ఆర్. కె; మధిర్**

మీరు భాగ్యనగరంలో ఉంటారు కదా మరి పత్రికకి (విజయవాడ) ఎట్లా సమాధానం యిస్తారూ!

అదా మీ అనుమానం ! నేనెంత గట్టిగా అరవ కలనో మీకు తెలియదు లాగుంది ! మద్రాసులో కూర్చుని సమాధానాలు చెప్తున్నాను. (పోస్టు అనే ఒక పద్ధతి వుంది కదా....మరిచి పోయారా ? !)

**జి. ఆర్. ఆర్; కరీంనగరు**

చెడు అని తెలిసి కూడా చేసే వాళ్ళని ఏమనాలి ?

మొండివాళ్ళు. లేకపోతే అధికారం చేతిలో ఉన్నవాళ్ళు.

**రవి; ఆదోని**

నిజాన్ని కప్పిపుచ్చడానికి ఎన్నో అబద్ధాలు చెప్తారు. కాని ఏనాటికైనా నిజం స్వరూపం బయటపడుతుంది. మీరుఏమంటారు?

నేనేమంటాను? మొదటిఅబద్ధమే— నిజాన్ని తవ్వడానికి వేసిన తొలి దెబ్బ అంటానంతే !

**సి హెచ్. ఎస్; నిడదవోలు**

చనిపోయినవాళ్ళు దేవుడితోసమానం అంటారు. ఎలా అవుతారు ?

బ్రతికి వుంటేపెట్టే బాధలు చచ్చిపోయాక పెట్టలేరు కదా అని, కనిపించనిదేవుడితో జత కట్టేస్తారు.

**మధు కోటాల**

పవిత్ర ప్రేమకు అర్థం తెలియని అర్భకురాలిని ప్రేమించడం దండుగ అంటాను.

నిజమే. ప్రేమ మగవాడికి రెక్కలనిస్తుంది. ఆడదానికి ఇనుప కడియాలు వేస్తుంది. అంచేత ఏ ప్రేమకైనా, ఆడది చెప్పుకునే అర్థంవేరు మగాడి చెప్పుకునే నిర్వచనం వేరుగా ఉంటూ ఉంటుంది.

**జి. వి. జి; హనుమకొండ**

కన్నతల్లిని ఎదిరించే తనయుడు మా అన్నయ్య ఒక్కడే అనుకుంటాను. నవమాసాలు మోసి....

స్టాపిట్! తొమ్మిది నెలలు మోసి కనిపెంచి పెద్దచేసి ప్రయోజకులిని చేసినంత మాత్రాన తల్లిదండ్రులకు బానిసలు కాదు పిల్లలు.ఆసంగతి జ్ఞాపకం పెట్టుకోవాలి. ఈ నవమాసాలు మోసి అన్నది మరీ ఎమోషనల్ బ్లాక్ మెయిల్గా తయారైతే, ఇటు తల్లికీ అటు తనయుడికీ, సుఖంలేదు....వయసువచ్చిన పిల్లలు—స్నేహితులు.

**ఎస్ ఎన్. ఎమ్; ఆదోని**

మనిషిలోని స్వార్థం అతన్ని కాల్చడం సహజమే. కాని అదే ద్వేషంగా మారి ఎదుటి జీవితంలోకార్చిచ్చు పెడితే, అటువంటి వ్యక్తులని ఏమనాలి ?

స్వార్థం ద్వేషంగా మారినప్పుడు నిప్పుకి గాలి తోడైనట్టన్నమాట. అదుపులో పెట్టుకుంటే మనిషి, అదుపులో పెట్టుకోకపోతే మరిచి !

**ఎస్. బి. – బళ్ళారి**

అక్కయ్యగారూ ! మీరు అభిమానవతికి మాటలు కూడా వ్రాసినట్టు తెలిసింది. ఆ పని అంతగా నచ్చినట్లు లేదు. కాని అభిమానవతి చిత్రం అన్ని విధాలా చాలా బాగా వుంది. మీరా చిత్రం చూశారా లేదా?

చూశాను. నాకూ చాలా ఇష్టమైన చిత్రం అది. అది నా తొలి చలన చిత్రం. డూండీ గారు నన్ను పరిచయం చేశారు — ఆ చిత్రంతో.

**ఎమ్. వి. ఎస్. – హైదరాబాదు**

మంచితనాన్ని చేతకాని తనంగానూ, పిరికితనంగానూ భావించే యీ సంఘంలో మంచిగా వుండ కూడదనుకుంటున్నాను. మీ సలహా?

సత్య హరిశ్చంద్రుడు కూడా కించిత్తు అసత్యం పలక్క బ్రతకడీ నాడు! అంచేత— డిప్లొమేటిక్గా బ్రతకడం నేర్చుకోండి.

**ఎల్. వి. ఎస్. ఆర్; భువనేశ్వర్**

మాటకు విలువ ఎంత ?

అన్నవాడు చెప్పు విప్పుకున్నంత.

న్యాయానికి నిర్వచనం ? నేటి సమాజంలో.

ఇదేనా న్యాయం ? అని ముక్కుమీద వేలేసుకు వెట్టు వున్నది నేటిన్యాయానికి అర్థం.

**అమరావతి; శ్రీహరికోట**

మగవాణ్ణి గుప్పిట్లో పెట్టుకొనే ఆడదాన్ని ఏమనాలి ?

జాణ !

**జె. వి. కె. ఆర్. – విజయవాడ**

స్నేహితులని నిలబెట్టుకోవాలంటే?

సింపుల్. శత్రువు కావాలంటే— ఒకరి జయించాలి. స్నేహితుడు కావాలంటే నువ్వే నిన్ను జయించుకో గల్గాలి!

**వల్లభ్ - వడాలి**

దాదాపు అన్ని పత్రికలలోనూ లేటెస్టుగా వస్తున్న భయానక సీరియల్స్ మీరుచదువుతున్నారా? వాటిపై మీ అభిప్రాయమేమిటి?

అభిప్రాయం చెప్పేంత ధైర్యం కూడా లేదు నాకు ! అయినా వీటిని ఏ 'ఏ' పత్రికలు

గానో ప్రకటించి సిరికివాళ్లకి రక్షణ కల్పించ వలసిన అవసరం మన అంజయ్యగారిమీద వుంది. కథలే భయంకరం అంటే బొమ్మలు మరీ జుగుప్సాకరంగా ఉంటున్నాయి. అసలీ మధ్య బొమ్మలు కథలకు వేస్తున్నవి 'పోర్నో' కిందికి వస్తున్నాయంటే అబద్ధంకాదు ! బాడీ మీదా బ్లేడుమీదా ఆడదాని బొమ్మ వేయగా లేంది నగ్నంగా యీావిడగారిని కథయందు స్వయర విహారం చేయిస్తే ఏం పోయిందను కుంటున్నారో ఏమో, తెలియడంలేదు. అసలు మన సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగారు పేటలో నాట్యాచార్యులని నిలబెట్టే ముందు ఈ అసభ్య సుందర సాహిత్యాన్ని, చిత్రాలనీ కట్టు దిట్టంచేస్తే అబ్సీన్ లిటరేచర్ నిషే ధించే పద్ధతి కనిపెట్టడం—మంచిది. ●

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

**కళాఖండాల తరలింపు :**

మంచీ చెడూ ఒక నాణెం రెండు వైపులని పిస్తుంది. అందువల్లే మన పెద్దలు సుఖదుఃఖాలను ద్వంద్వాలని జంటలుగా చేశారు. కొన్ని లక్షలమంది బువ్వపెట్టే ప్రాజెక్టులకు పూనుకుంటే, అమూల్యమయిన కళా భండారం నీటిపాలు కావడం సంభవిస్తూంటుంది. కాని జీవనాధారాలయిన తిండి, బట్ట, గూడు ఉన్నప్పుడే తక్కినవన్నీ గనుక, కడుపు నిండిన తర్వాత కళలకు లోటుండదు గనుక జలాశయాలకు ప్రాధాన్యమన్నది నిర్వివాదాంశం. అయినా మన వారసత్వాన్ని చేజేతులా పోగొట్టుకొనడానికి మనసొప్పదు గనక దానిని భద్రపరచుకొనడానికి శాయశక్తులా ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ఆ ప్రయత్నమే జరుగుతున్నది, శ్రీశైలం ప్రాజెక్టు విషయంలోను. ఈ ప్రాజెక్టు క్రింద మునిగిపోయే పెక్కు కళా సంభరిత దేవాలయాలను తరలించడానికి నాలుగయిదేళ్ళుగా ఆలోచనలు జరుగుతున్నాయి. ఇటీవల అవి మరింత వేగం పుంజుకున్నాయి. ఈ ప్రాజెక్టు కింద మునిగిపోయే మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లా దేవాలయాలను, శిల్ప వాస్తు సంపదను సురక్షితమయిన ప్రాంతానికి తరలించడానికి రాష్ట్ర ప్రభుత్వం దాదాపు ముప్పయి లక్షల రూపాయలు కేటాయించింది. మహబూబ్‌నగర్ జిల్లా సోమశిల దేవాలయాన్ని, కర్నూలు జిల్లాలోని పాతకోట దేవాలయాన్ని, ఈర్లదిన్నె దేవాలయాన్ని సురక్షిత ప్రాంతాలకు తరలించే పనులు త్వరలో ప్రారంభమవుతాయి. కర్నూలుజిల్లా రూపాల సంగమేశ్వరం నుంచి భుజంగేశ్వర దేవాలయాన్ని, సిద్ధేశ్వర దేవాలయాన్ని జూపాడు ఇన్‌స్పెక్షన్ బంగళా సమీపంలో పునర్నిర్మిస్తారు. పాతకోటలోని పంచన గుళ్ళు కాశీ విశ్వేశ్వర, నాగేశ్వరాలయాలు, ఉగ్ర రామేశ్వరం దేవాలయం అలంపూర్ సమీపంలో వెలకొంటాయి. ఇంతవరకు 48 దేవాలయాలు ప్రాజెక్టులో మునిగాయి. వీటిలో అతి ముఖ్యమైన విగ్రహాలను కళాఖండాలను మాత్రమే పురావస్తు శాఖ, దేవాదాయ ధర్మాదాయ శాఖ భద్రపరిచాయి. మునిగిపోయే ప్రాచీన దేవాలయాల నమూనాలను తయారు చేసి భద్రపరచడం కూడా ఈ కార్యక్రమంలో ఒకటి. దేశ విభజన జరిగినప్పుడు, మహెంజదారో, హరప్పాల త్రవ్వకాల అపూర్వ వస్తువులు మనం ఇలాగే నమూనాల్ని తీసుకుని భద్రపరచుకొన్నాం.

**కొత్త మంత్రి శ్రీ కేశవరావు :**

ఒక పత్రికా రచయిత రాష్ట్ర మంత్రి అయినందుకు ఆనందించవలసిందే. విధానపరిషత్తు డిప్యూటీ చెయిర్మన్ శ్రీ కె. కేశవరావు రాష్ట్ర విద్యా మంత్రిగా జులై 27న ప్రమాణస్వీకారం చేశారు. శ్రీ కేశవరావు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎం. ఏ [ఫిలాసఫీ] పట్టభద్రులు. ఇదానీంతన భారతీయ భావనలో సాంఘిక తత్త్వం— అనే విషయమై పరిశోధన చేసి డాక్టరేట్ పొందారు. విద్యార్థి నాయకులుగా ఉండేవారు. ఇంటర్ యూనివర్శిటీప్లానింగ్ ఫోరంకు అధ్యక్షులుగా అంతర్జాతీయ విద్యార్థి సమావేశాలలో మనదేశానికి ప్రాతినిధ్యం వహించారు. కొంతకాలం డెయిలీ న్యూస్ ఆంగ్ల పత్రికకు సంపాదకులుగా ఉన్నారు. ఆయనకు 1976లో కలకత్తా రైటర్స్ కాన్ఫరెన్సు నుంచి జాతీయ ప్రముఖ పత్రికా రచయిత (సెవన్ డిస్టింగ్విష్డ జర్నలిస్ట్) అవార్డు లభించింది. రాష్ట్ర కనీసపు వేతనాల బోర్డు అధ్యక్షులుగాను, జాతీయ చలనచిత్ర అవార్డుల సంఘం సభ్యులుగాను ఉన్నారు. ఆయన నిర్మించిన నిమజ్జనం చిత్రం ఉత్తమ తెలుగు చిత్రంగా జాతీయ బహుమతి అందుకొంది. అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలలోను ఆయనకు పరిగణన లభించింది. 1978లో ఆయన పట్టభద్ర నియోజకవర్గం నుంచి విధానపరిషత్తుకు ఎన్నికయ్యారు. 1980 మార్చిలో విధానపరిషత్తు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. విద్యావంతుడు, విద్యాతత్త్వవేత్త అయిన శ్రీ కేశవరావు నిర్వహణలో విద్యాశాఖ కొత్త మొగ్గలు తొడుగుతుందని, మూడు పువ్వులు, ఆరు కాయలుగా విరగ్గాస్తుందని ఆశిస్తున్నాను.

**జంట నగరాలలో కొత్త రోడ్లు :**

జంటనగరాలలో నానాటికీ పెరుగుతున్న రాకపోకల రద్దీని తగ్గించడానికి నగర పాలక సంఘం పెద్ద ఎత్తున రోడ్ల విస్తరణ కార్యక్రమం, కొత్త రోడ్ల నిర్మాణ కార్యక్రమం ప్రారంభించింది. టాంక్‌బండ్ రోడ్డు మొదలైనవి విస్తరమవుతున్నాయి. సచివాలయం పక్కన హుస్సేన్‌సాగర్ గట్టున కొత్త రోడ్డు పోయటం పూర్తయింది. ఈ కార్యక్రమం కోసం రెండు కోట్ల రూపాయలు వ్యయమవుతాయట. పూర్తి కావడానికి సంవత్సరం పడుతుంది. ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య ఈ కార్యక్రమాన్ని జులై చివరి వారంలో పరిశీలించారు. నగరపాలక సంఘం ప్రత్యేక అధికారి శ్రీ అర్జునరావు మున్సిపాలిటీ ముఖ్యమంత్రికి వివిధ పథకాల గురించి వివరించారు.

**ఉపశ్రుతి :**

ఏంటి సార్, మన నగరం రోడ్లన్నింటినీ తవ్వి పారేస్తున్నారేం— అనడిగారు నా మిత్రులు. మన నాయకులంతా ఇటీవలే మలేసియా వెళ్ళొచ్చారుగా, అక్కడి రోడ్లను చూసిన ప్రభావమే ఇది— అన్నారు మరొకరు.

# ఉత్తరాలు

[5వ పేజీ తరువాయి]

## కథలు

17.7.81 వ తేదీ సంచికలో మీరు ప్రచురించిన కథలన్నింటిలో "పెనుభూతం" కథ మాకు బాగా నచ్చింది. ఈ కథ వాస్తవమే. కథలో మురళి తనకు కల్గిన అనుమానాలే చివరకు నిజమయ్యేసరికి మాకు కూడ కాస్త బాధ కల్గింది. నిజానికి మన దేశంలో చాలచోట్ల డాక్టర్ల అశ్రద్ధవల్ల ఎందరో తమ ప్రాణాలను పోగొట్టుకొంటున్నారు. రోగుల పట్ల డాక్టర్లు అశ్రద్ధ చేసితే ఎలాంటి పరిణామాలకు దారి తీస్తుందో కథలో చక్కగా తెలియజేశాడు రచయిత. కథకు తగ్గట్లే బొమ్మ కూడాబాగానే వేశారు చిత్రకారుడు. రచయితకు, చిత్రకారుడికి మా అభినందనలు అందజేయండి.

మధుసూదన్‌రావు, చంద్రశేఖర్ దేశాయ్
(నందలూరు)

*　　*　　*

17.7.81 కల్పనాఅయ్యర్ ముఖచిత్రంతో వెలువడ్డ పత్రిక 'బాలలూ మీకు జోహార్లు' మమ్మల్ని కుతూహలపరిచినది. ఈ కథ వ్రాసిన వారికి మా అభినందనలు. మంచి సీరియల్సు ప్రచురించు చున్నందుకు మా ధన్యవాదాలు.

ఎస్. వి. సత్యనారాయణరాజు, కె. సుబ్బరాజు
(ఉండి)

*　　*　　*

31.7.81 నాటి ఆంధ్ర పచిత్ర వారపత్రికలోని కొనకళ్ల తేజస్ కుమారిగారి 'కూయునీ కాకుల్ని' యదార్థ చిత్రీకరణ నాకు బాగా నచ్చింది. కట్నం పుచ్చుకొనే లోకానికీ కథ ఏమాత్రం కనువిప్పు కలిగించినా ఎంతో సంతోషించవలసిన విషయం.

పాలాది వాణిశ్రీ (పూరుకొండపేటగ్రామం)

*　　*　　*

31.7.81 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా అభిమాన నటి, అందాల సుందరి జయప్రద ముఖచిత్రం మా హృదయాలలో చెరగని ముద్ర వేసింది. కథలలో ముఖ్యంగా మాకు నచ్చిన కథ కూయునీ కాకుల్ని . మన సమాజంలో పెళ్లికాని ఆడపిల్లల్ని అవహేళన చేసే నారీమణులకు కనువిప్పు కలిగించే విధంగా ఉన్నది. రచయిత్రికి మా ధన్యవాదములు.

పి. పద్మావతి. ఎ.వి. సుశీల [టి. బి. డాం.]

*　　*　　*

సందో గారి కొక్కొరొక్కో కథ చాలా బాగుంది. దారి తప్పిన అమ్మాయిల కథ వ్రాసి మరల వారిని సన్మార్గమున ప్రవేశించుటకు... కథను చాలా బాగా అల్లారు. వారికి మా ధన్యవాదములు.

కె. మహబూబ్‌బాషా [నేమకల్లు]

# ఉత్తరాలు

7.8.81 సంచికలో ప్రచురించిన అపురూపం కథ చాలా బాగుంది. మధ్య పేజీలో కృష్ణ, శ్రీదేవి స్టిల్ చాలా బాగుంది. మీకు నా ధన్యవాదాలు.

జి. ఎం. గిరిధర్ [గిరింపేట]

* * *

7.8.81వ సంచికలో 'కొక్కొరోకో' కథ బాగుంది. శ్రీరాం లాంటి పాత్రలు వాస్తవ ప్రపంచంలో దొరకరు. అపురూపం కథ పరవాలేదు. ఎదురు చూపు ఇంటరెస్టుగా ఉంది.

ఇ. సుబ్బారావు [పెదనందిపాడు]

* * *

7.8.81 నాటి ఆంధ్రపత్రికలోని కథలలో అపురూపం కథ మాకు చాలా నచ్చింది. ఎదురు చూపు తీయగా ఉంది.

గెడ్డం శారద [విశాఖపట్నం]

* * *

24.7.81 తేది గల "ఆంధ్ర సచిత్ర వార పత్రిక"లో సన్నుఅమితంగా ఆకట్టుకున్న కథానిక పరీక్ష.

మగ్గుతున్న పక్కమీద తాటికాయ పడి బాధించేటట్టు, కుటుంబ పరిస్థితులచే సతమత మవుతున్న మధ్యతరగతి విద్యార్థులకు ఆర్థిక పరిస్థితుల వల్ల ఒక్కొక్కసారి అడకత్తెరలో పోక చెక్క మాదిరి సంకట పరిస్థితులెదురైతాయన్నది సత్యం. ఒక్క చిరంజీవే కాదు. వర్తమాన కాలములో ఎందరో మధ్యతరగతి కుటుంబాలకు చెందిన చిరంజీవులు [విద్యార్థులు] పరీక్ష ఫీజులు చెల్లించేందుకు ఇలాంటి చేదు పరీక్షలకు ఎదురవుతూనే ఉన్నారన్నది జీవిత సత్యం.

కానిచిరంజీవి తండ్రిని త్రాగుబోతుగా చిత్రించకుండా, గొర్రె తోకలాంటి సంపాదనతో సంసార రథాన్ని జీవనబాటపై నెట్టుకు వస్తున్నట్లు చిత్రించి ఉంటే మధ్యతరగతి మనుగడ మరింతగా ప్రతిబింబించేది.

రచయిత ఎల్సో నారాయణరావుకు సాహితీ కృతజ్ఞతలు.

మూరాడ నారాయణరావు [హిమగిర్]

* * *

31.7.81 ఆంధ్ర సచిత్ర వారపత్రికయందలి పెండ్యాల సుబ్రమణిగారి వాసంతి నిర్ణయం చదివిన తరువాత ఉత్తరం వ్రాయక వ్రాయాలనిపించింది. కథా వస్తువు సరిక్రొత్తది మరియు ఆధునిక సమాజానికి సరిక్రొత్త సందేశాన్నిచ్చింది. ఈ కథ మానవత్వపు విలువల్ని మరింత పెంచేస్తుందని నిక్కచ్చిగా చెప్పొచ్చు. నిజంగా తనబావ శారీరకంగానే కాక మానసికంగా కూడా ఎదగలేదని నిరూపించింది శారద.

పాలాని లక్ష్మీనారాయణ (కల్వకుర్తి)


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street
Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna

